విశ్వసాహిత్యమాల—6.



# కారల్ మార్క్స్ ఉపదేశాలు

వి. ఐ. లెనిన్.



అనువాదం:-

మహీధర జగన్మోహనరావు



"Oh, what a lamp of reason ceased to burn,
What a heart had ceased to throb!"

డోబ్రొల్యుబోవ్ మరణసందర్భంలో —నెక్రసోవ్ గీతభాగం.

వెల రు 1/-

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

4

ప్రథమ ముద్రణ 1936 నవంబరు.
ద్వితీయ ముద్రణ 1952 జూలై.

"ప్రపంచ కార్మికులారా! ఏకము కండు! సంకెలలు మినహా పోయేవి మన కేమీ లేవు. జయించుటకా, సువిశాలమైన యీ విశ్వమంతా వుంది!" మార్క్సు - ఏంజిల్సు: కమ్యూనిస్టు మానిఫెస్టో.



"కార్మికులకు మేమిట్లు చెపుతాం: కేవలం ప్రస్తుత పరిస్థితులను మార్చడానికే గాదు; మిమ్మల్ని మీరు మార్చుకుని, రాజకీయాధికారాన్ని చెలాయించడానికి తగినవారుగా తయారవడానికి పదీ, యిరవై, యాభై సంవత్సరాల వరకూ కూడ అంతర్యుద్ధాల్లోనూ, అంతర్జాతీయయుద్ధాల్లోనూ మునిగి తేలుతూనే మీరు ముందుకు పోవాల్సివుంటుంది."

—1851 కొలోన్ కమ్యూనిస్టుల విచారణాసందర్భంలో మార్క్సు-

రాజమహేంద్రవరమున లక్ష్మీప్రెస్ నందు ముద్రింపబడెను—1952

# విషయసూచిక

# 6

## సంపాదకీయ భూమిక.

1914 వేసవిలో లెనిన్, గలీషియా రాష్ట్రంలోని పొరోనినో గ్రామానికి స్విట్జర్లాండునుండి వచ్చిచేరుకున్నారు. ఈగ్రామం రష్యా సరిహద్దుకు దగ్గరలో నుండుటవల్ల రష్యాలోని తన సోదరబృందంతో వుత్తరప్రత్యుత్తరాలు నిరాఘాటంగా జరుపుకో వచ్చుననే ఆయన యిక్కడకు వచ్చెను. అప్పట్లో గ్రానట్ తయారుచేస్తూన్న 'రష్యన్ విజ్ఞానసర్వస్వం' లోకి కారల్ మార్క్సుపై వ్యాసము వ్రాయమని లెనిన్‌ను కోరుటచే ఆతడు వెంటనే ప్రారంభించెను. కాని ప్రపంచయుద్ధము ప్రారంభమగుటతో లెనిన్‌ను రష్యా గూఢచారుడుగా అనుమానించి ఆస్ట్రియన్ అధికారులు బంధించేరు. తర్వాత రెండువారాల్లో ఆయనను విడుదలచేసి, స్విట్జర్లాండుకు బోవ ననుమతించేరు. యుద్ధంవల్ల వుత్పన్నమైన రాజకీయసమస్యలను గూర్చి, నిర్మాణసమస్యల్నిగూర్చి యెన్నో వ్యాసాలను వ్రాయ వలసివచ్చుటచే లెనిన్ నవంబరు వరకు మార్క్సును గూర్చిన వ్యాసాన్ని పూర్తిచేయనేలేదు.

ఆ దినాల్లో ప్రభుత్వనిఘా చాలతీవ్రంగా వుండడంవల్ల యీ వ్యాసమును సంగ్రహరూపంలోమాత్రమే విజ్ఞానసర్వస్వంలో ప్రకటించేరు. 'సోషలిజం' 'శ్రామికవర్గపోరాటంలోని యెత్తులు' అనే రెండుప్రకరణములను పూర్తిగా వదలివేయుటే గాక యింకా అనేకభాగాలలో మార్పులను, లోపములను

గావించేరు. లెనిన్ వ్రాతలన్నిటినీ సంపూర్ణగ్రంథావళిగా మాస్కోలోని 'లెనిన్ యిన్‌స్టిట్యూట్' ప్రకటించింది. 1914-15 లలో లెనిన్ రచనలను 'ఇంపీరియలిస్టు యుద్ధం' అను పేరిట పద్ధెనిమిదో సంపుటంలో సమకూర్చేరు. ఆ సంపుటం లోనిదే యీ వ్యాసం. మార్క్సు అనుయాయియు, ముఖ్య వ్యాఖ్యాతయునైన లెనిన్ మహాశయుని మూలగ్రంథాన్నుంచే యీ వ్యాసం సుబోధకంగా అనువదించబడింది

మార్క్సు, యేంజిల్సుల వ్రాతలనుంచి ప్రమాణముల ననేకసందర్భములలో నీ వ్యాసమందు లెనిన్ వుదాహరించి యున్నారు. సాధ్యమైనంతవరకు వాటికి సరియైన భాషాంతర మునే వ్రాసియున్నాము. అవసరమైనచోట్ల ప్రమాణగ్రంథ ముల నుదాహరించియున్నాము.

మార్క్సు, యేంజిల్సుల గ్రంథాల్లో చాల కొద్దిభాగం మాత్రమే తర్జుమా చేయబడియున్నాయి. మార్క్సు 50 వ వార్షికోత్సవసందర్భంలో ఆయన గ్రంథముల నన్నిటిని ప్రక టించడానికి యింగ్లీషువారు పూనుకొని, 'మార్క్సు-యేంజిల్సు లెనిన్ యిన్‌స్టిట్యూట్, మాస్కో' వారొసంగిన మూలాన్నుంచి తర్జుమా చేయించిరి. 1933 ఆఖరికి యింగ్లీషుభాషకు యీ దర్రిద్రం తీరిపోయింది.

మార్క్సు బోధనలనుగూర్చి తెలుసుకో దలచినవారికి యీ వ్యాసం చక్కని వుపోద్ఘాతంగా వుండగలదు. 'ఇదే శాశ్వత' మనే దురభిప్రాయంతో గూడిన సిద్ధాంతాలకు గాని,

నిర్జీవములగు సిద్ధాంతాలకు గాని మార్క్సిజంలో తావులేదు. కార్యాచరణకు మార్గదర్శకములై, క్రమవికాశాన్ని పొందు సజీవసిద్ధాంతములనే ప్రపంచానికి మార్క్సు మహాశయు డొసంగియున్నాడు. మార్క్సు సిద్ధాంతాల్లో యిమిడియున్న విప్లవబీజాల్ని పోషించి, వృద్ధిగావించడానికి లెనిన్ తగినవాడు. ఆ విషయాన్ని యీ వ్యాసం ఋజువుచేయగలదు. కమ్యూనిజమ్‌ను బోధించిన మార్క్సు-యేంజిల్సులకును, మార్క్సిజాన్ని విపులీకరించి, పెట్టుబడిదారీవిధానంయొక్క అంత్య-క్షీణదశ యనదగు సామ్రాజ్యవాదంయొక్క యుద్ధాలు, విప్లవాలతో కూడిన శకము నందు దాని నాచరణలోనికి దెచ్చిన లెనిన్‌కును గల యవినాభావసంబంధాన్ని యీ వ్యాసమే ఋజువు గావిస్తూంది. మార్క్సిజమ్‌వల్ల ప్రస్తుత సంఘంలోని నిర్జీవ సిద్ధాంతాలు నాశనమగు ననీ, విశ్వమానవకళ్యాణ మొనగూరు ననీ సోదాహరణముగా లెనిన్ చూపియున్నాడు.

తెలుగులో యిట్టి పుస్తకము లరుదు. ఇట్టివి మన భాషలోకూడ విరివిగా ప్రచురించి, సామాన్యప్రజానీకాని కందుబాటులో నుంచుట విద్యాధికుల కర్తవ్యము. విలాసగా కాక తగినంత యభినివేశముతో నీ మాదిరిగ్రంథాలను పఠించుట యువకుల, విద్యార్థుల కర్తవ్యము.

# ౧

# కారల్ మార్క్సు జీవితం

ప్రష్యా దేశంలోని రైన్ రాష్ట్రంలో ట్రియర్ అనే పట్టణంలో 1818 మే 5వ తేదీని కారల్ మార్క్సు జన్మించెను. అతని తండ్రి యూదు మతస్థుడే కాని 1824లో ప్రొటెస్టాంటు మతాన్ని స్వీకరించెను. న్యాయవాదిగానుండి యాతడు ధన సంపాదన చేయుచుండెను. ఆయన వంశస్థులందరు విద్యాసంస్కారములు గలవారును, ధనవంతులును నైయుండిరే గాని విప్లవ భావాలు కలవారు గారు. ట్రియర్ పట్టణంలోని వున్నత కళాశాలలో విద్యాపరిపూర్తి గావించుకొని, మార్క్సు బాన్ విశ్వవిద్యాలయంలోనూ, తరువాత బెర్లిన్ విశ్వవిద్యాలయం లోనూ న్యాయవాద శాస్త్రమును పఠించేడు. ఆయనకు మొదటి నుండీ చరిత్ర, వేదాంతశాస్త్రముల, వేదాంతశాస్త్రముల యం దాసక్తి మెండు. అందుచే తన కాలాన్నంతనూ మార్క్సు వాటి పఠనమునందే వినియోగించేవాడు. 1841 లో విద్యాపరిపూర్తి గావించుకొన్న తర్వాత మార్క్సు 'ఎపిక్యూరస్' తత్వసిద్ధాంతాలమీద నొక విమర్శనాగ్రంథాన్ని రచించి 'డాక్టర్' పట్టమును స్వీకరించేడు. ఆ రోజులనాటి కింకా హెగెల్ పంక్తుని భావవాదాన్నే మార్క్సు అవలంబించియుండేవాడు. హెగెలియన్ అతివాదులైన బ్రూనో బూయర్ మొదలైన

వారితో మార్క్సు యేకీభవించేవాడు. ఈ అతివాదులు హెగెల్ బోధనలనుంచి నాస్తిక, విప్లవకర నిర్ణయాలను తీస్తూండేవారు.

విద్యను పూర్తిగావించుకొన్న తరువాత మార్క్సు ప్రొఫెసరుగా తన జీవితమును గడుపు నుద్దేశ్యముతో బాన్ నగరానికి వచ్చిచేరేడు. కాని అప్పటి జర్మన్ ప్రభుత్వం చాల సంకుచిత దృష్టిగలదై మాటిమాటికి విశ్వవిద్యాలయాల ప్రొఫెసరులనుకూడ నిర్బంధించుతూండేది. 1832లో లూడ్విగ్ ఫ్యూయర్ బాహ్ అను తత్వవేత్తను ప్రిన్సిపాల్ పదవినుంచి తొలగించడమే గాక 1836లో ఆతనిని యూనివర్సిటీ ఆవరణలోనికే రాకూడదని నిషేధాన్ని విధించింది! అంతేగాక 1842 లో యువకుడైన బ్రూనో బాయర్‌ను విశ్వవిద్యాలయంలో వుపన్యాసము నీయకుండ చేసింది. ఇట్టి నీచత్వము నవలంబించే ప్రభుత్వంక్రింద స్వతంత్రభావ పూరితులకు విశ్వవిద్యాలయాలలో ప్రవేశం కలగడం, కలిగినా నిలబడియుండడంకూడ దుస్సాధ్యమే. గాన, మార్క్సు యీ ఆశలను వదలుకొన్నాడు. ఆ రోజుల్లో అతివాద హెగెలియన్‌ల ప్రచారం అతిశీఘ్రగతిలో సాగుతూంది. 1836 నుంచీ లూడ్విగ్ ఫ్యూయర్ బాహ్ ఆస్తికవాదాన్ని తీవ్రంగా విమర్శిస్తూ, ఖండన గావిస్తూండేవాడు. ఆయన సిద్ధాంతాల్లో భౌతికవాదంవైపు మొగ్గుదల అప్పటికే విస్పష్టంగా కనిపిస్తూండేది. 1841 నాటికి లూడ్విగ్ తత్వబోధనల్లో భౌతికవాదానిదే పైచేయి అయింది. 'క్రైస్తవమతసారము' 'భావితత్వశాస్త్ర

సూత్రములు' (The Essence of Christianity & Principles of Philosophy in the Future) అనే గ్రంథాల నీయన రచించి, 1843 నాటికి ప్రకటించేరు. ఈ గ్రంథాలను గూర్చి ఏంజిల్సు యిట్లా వ్రాసియున్నాడు: "ఈ గ్రంథాలు చదవడంవల్ల గలిగే స్వేచ్ఛాభావాలను అనుభవించి తీరాల్సిందే! మేము (మార్క్సు మొదలగు హెగిలియను అతివాదులు) వెన్వెంటనే ఫ్యూయర్ బాహ్ అనుయాయులమైనాము."

రైన్ రాష్ట్రంలోని బూర్జువా వుదారవాదులు కొందరు ఆ రోజుల్లో కొన్నికొన్ని విషయాల్లో హెగెలియన్ అతివాదులతో యేకీభావాన్ని కలిగివుండేవాళ్ళు. వాళ్ళు ప్రభుత్వవిధానాల నెదిరిస్తూ, అందులకై "రైనిష్ గేజెట్" అనే పత్రికను స్థాపించదలచి, ఆ పత్రికకు ముఖ్యలేఖరులుగా నుండమని మార్క్సు, బ్రూనో బూయర్‌లను ఆహ్వానించేరు. ఈ పత్రిక 1842 జనవరి 1వ తేదీనే ప్రారంభమైంది. 1842 అక్టోబరు నాటికి మార్క్సు యీ పత్రికకు ప్రధానసంపాదకు డయేడు. ఆతడును వెంటనే బాన్ నుండి కొలోన్ నగరానికి వచ్చేడు. మార్క్సు సంపాదకత్వంక్రింద రైనిష్ గేజెట్ యొక్క విప్లవకర ప్రజాతంత్రపోకడలు క్రమంగా వెల్లడి కాజొచ్చినాయి. పత్రిక యొక్క ముఖ్యోద్దేశమును కనిపెట్టి ప్రభుత్వము దానిపై నిఘాను అంతకంతకు హెచ్చిస్తూ, ఆఖరుకి 1843 య్మేప్రియల్ 1వ తేదీని పత్రికనే నిలిపివేసింది. ఈ గందరగోళ మిట్లుండగానే

మార్క్సు తన సంపాదకత్వానికి రాజీనామా యిచ్చేసేడు. కాని, మార్క్సు పత్రికను వదలిపెట్టినా, ప్రభుత్వమేమో దానిని పూర్తిగా అణచివేయడానికే నిశ్చయించింది. రైనిష్ గేజెట్‌లో మార్క్సు వ్రాసిన వ్యాసాల్లో 'మోసల్లె లోయలోని ద్రాక్ష తోటల రైతుల స్థితిగతు'లను గురించినది చాలముఖ్యమైనదని యేంజిల్సు అభిప్రాయం. పత్రికా సంపాదకుడుగా కలిగిన అనుభవంవల్ల తనకు అర్థశాస్త్రంయొక్క అవసరమును, అర్థశాస్త్రం రాని లోపమును తెలిసివచ్చినాయి. అందుచే నాతడు బహు శ్రద్ధతో యర్థశాస్త్రపఠన మారంభించేడు.

1843లో క్రూజ్‌నాచ్ నగరంలోని వాన్ వెస్టుఫాలెన్ ప్రభుకుటుంబానికి చెందిన జెన్నీ యను కన్యను మార్క్సు పెండ్లి యాడెను. ఆమె మార్క్సుకు చిన్ననాటి స్నేహితురాలు; చదువుకొనేటప్పుడే ఆతనికి ప్రధానంచేయబడినది కూడాను. ప్రష్యన్ ప్రభుత్వం అతిక్రూరనిరంకుశత్వంతో పాలించిన 1850-1858 కాలంలో జెన్నీ పెద్దన్నగారే ప్రష్యను ప్రభుత్వంలో దేశీయవ్యవహార మంత్రిగా వున్నాడు. 1843 శిశిరఋతువులో మార్క్సు పారిస్ నగరానికి వెళ్ళి ఆర్నాల్డ్ రూజ్* తో కలిసి అక్కడినుంచే అతివాదపత్రిక నొకదాన్ని ప్రచురించ నారంభిం

* ఆర్నాల్డ్ రూజ్ హెగిలియనులలో అతివాది. 1802 జననం 1880 మరణం. 1825 - 1830 మధ్య కారాగారవాసం; 1843 తర్వాత రాజకీయ ప్రవాసి. 1866 - 1870 మధ్య బిస్మార్కు-యనుగా వున్నాడు.

చేడు. కాని. ఆ పత్రిక మొదటి సంచికతోనే నిలిచిపోయింది. 'జర్మన్ ఫ్రెంచి యితిహాసాలు' అనే ఆ పత్రికను జర్మనీలో రహస్యంగా పంచవలసిరావడంవల్లా, అట్లు చేయడం బహు కష్టంగా వుండడంవల్లా, రూజ్‌తో అభిప్రాయభేదాలవల్లా యీ పత్రిక నిలిపివేయవలసి వచ్చింది. ఆ పత్రికలోని మార్క్స్ వ్యాసాలను చూస్తే అప్పటికే ఆతడు విప్లవకారుడుగా మారి నట్లు మనం తెలుసుకోగలం. ఆచరణలోనున్న ప్రతివిధానాన్నీ, విషయాన్నీ నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తూండడం, అందులోనూ హింసాసాధనాలైన ఆయుధాల్ని అతితీవ్రంగా ఖండిస్తూ, ఆయుధ ప్రయోగాన్ని ప్రతిఘటించమని ప్రజాసామాన్యాన్నీ, శ్రామిక వర్గాన్నీ ప్రబోధించడం ఆనాటి మార్క్స్ వ్యాసాల్లో స్పష్టంగా కనిపిస్తుంది.

1844 సెప్టెంబరులో ఫ్రెడరిక్ యేంజిల్స్ పారిస్ వచ్చి, కొద్దిరోజు లచ్చట వున్నాడు. అప్పుడే మార్క్స్, యేంజిల్సులకు స్నేహ మేర్పడింది. పారిస్‌లోని విప్లవసంఘాలలో వీరిద్దరూ చురుకుగా పనిచేస్తుండేవాళ్ళు. ఆ రోజుల్లో ఫ్రాన్సులో ప్రౌఢన్ సిద్ధాంతాలే యెక్కువ ప్రచారంలోవుండేవి. (ప్రౌఢన్ సిద్ధాం తాల్ని పూర్తిగా ఖండిస్తూ తరువాతనే 1847లో మార్క్స్ 'తత్త్వశాస్త్రదారిద్ర్యం' అనే గ్రంథాన్ని ప్రచురించేడు.) ఆ కాలంలో ప్రచారంలోవున్న 'పెటీబూర్జువా' సోషలిజమ్‌యొక్క వివిధసిద్ధాంతాలను సునిశితంగా ఖండిస్తూ, మార్క్స్-యేంజి

ల్సులు విప్లవకరమైన 'ప్రొలిటేరియన్' సోషలిజంయొక్క ముఖ్యసూత్రాలను, యెత్తులను వెల్లడించిరి. ఈ ప్రొలిటేరియన్ సోషలిజం సిద్ధాంతాలనే అప్పటినుంచీ శ్రామికవర్గాలు ప్రపంచమందన్ని దేశాల్లోనూ తమ విముక్తికై ప్రయోగిస్తున్నారు. వీనినే కమ్యూనిజమనీ, మార్క్సిజమనీ అంటారు. 1844 1848 మధ్య మార్క్సు వ్రాతలను* చూస్తే ఆయన యెంత కృషి గావించిందీ మనం తెలుసుకోగలం. ప్రష్యన్ ప్రభుత్వపు ఒత్తిడిపైన 1845లో ఫ్రెంచిప్రభుత్వం మార్క్సునొక ప్రమాదకరుడైన విప్లవవాదిగా పరిగణించి, పారిస్‌నుంచి వెళ్ళగొట్టింది. మార్క్సు తన నివాసాన్ని బ్రస్సెల్సు నగరానికి మార్చేశు. 1847 వసంతంలో 'కమ్యూనిస్టు సమితి' యనే రహస్యసంఘంలో మార్క్సు యేంజిల్సులు సభ్యులుగా చేరేరు. ఈ సమితియొక్క రెండో కాంగ్రెస్ 1847 నవంబరులో లండన్‌లో జరిగినపుడు, యీ మిత్రులిద్దరూ ముఖ్యసూత్రధారులై అచ్చటి కార్యక్రమాన్నంతనూ నడిపేరు. 'కమ్యూనిస్టు సమితి' తరఫుననే మార్క్సు యేంజిల్సు లిద్దరునూ కూడి జగత్ప్రసిద్ధమైన కమ్యూనిస్టు మానిఫెస్టోను తయారుచేసి, 1848 ఫిబ్రవరిలో ప్రకటించేరు. ఈగ్రంథం ప్రపంచాన్నిగూర్చి నూతనదృక్పథాన్ని, నవ్య

* ఈ కాలంలో మార్క్సు రచన లివి:- హెగెల్ సిద్ధాంతవిమర్శ; హక్కుల తత్త్వం; పవిత్రకుటుంబం; జర్మన్ భావనాక్రమం; తత్త్వశాస్త్ర దారిద్ర్యం; కమ్యూనిస్టు మానిఫెస్టో.

ధావాల్ని వెల్లడించింది; భౌతికవాదాన్ని మానవసమాజజీవితానికంతకూ సుసంగతంగా వర్తింపజేసింది; సంఘపరిణామ క్రమాన్ని స్పష్టీకరించే విశాలగభీరసిద్ధాంతం గతితర్కమే నని ప్రపంచానికి చాటింది, అంతేగాక చరిత్రలో చోదకశక్తిగా. సమగ్రవర్గకలహసిద్ధాంతాన్నీ, శ్రామికవర్గం యొక్క చరిత్రాత్మక విప్లవపాత్రనూ సూచించి, రాబోవు కమ్యూనిస్టుసమాజ నిర్మాణపటిష్ఠమైనది శ్రామికవర్గమే నని నిర్ధరించింది.

1848 ఫిబ్రవరి విప్లవం జరిగినమీదట మార్క్సును బెల్జియంనుంచి పంపేశారు. అక్కడినుంచి పారిస్‌కి తిరిగివచ్చి ఫ్రాంసులో మార్చి విప్లవం జరిగిన తరువాత జర్మనీలోని కొలోన్ నగరానికి చేరుకున్నాడు. 1848 జూన్ 1వ తేదీనుంచి 1849 మే 19 తేదీ వరకు మార్క్సు సంపాదకత్వాన కొలోన్ నుండి 'న్యూ రేనిష్ గెజెట్' వెలువడింది. 1848-49ల మధ్య జరిగిన విప్లవసంఘటనలు నూతనమైన కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని ఆచరణ యోగ్యములని నిరూపించినాయి. అప్పట్నుంచి ఆ తరువాత యావత్ప్రపంచంలోనూ జరిగిన శ్రామిక వర్గోద్యమాలు, ప్రజాతంత్రోద్యమాలుకూడ యీ సిద్ధాంతాల్ని బలపరుస్తూ వస్తున్నాయి. జర్మనీలో విప్లవ మణచివేయబడింది. వెంటనే ప్రభుత్వం మార్క్సును విచారించి ఖైదుశిక్ష విధించింది. కాని 1849 ఫిబ్రవరి 9 న యీయనను విడిచిపెట్టి, 1849 మే 16 న జర్మనీనుంచే వెళ్ళగొట్టింది. అక్కడినుంచి మార్క్సు పారిస్‌కి

వెళ్ళేడు. 1849 జూన్ 13 న జరిగిన అసమ్మతి ప్రదర్శనాల తరువాత ఫ్రాన్సునుంచికూడ బహిష్కరించబడి యీ నిర్వాసి లండనుకు బోయి జీవితాంతమువరకు అక్కడనే యుండిపోయేడు.

మార్క్సు యేంజిల్సుల కెల్లప్పుడూ వుత్తరప్రత్యుత్తరాలు నడుస్తూండేవి. వాటిలో కొన్నిటిని 1913లో ప్రకటించిరి. వాటినిబట్టి చూస్తే ప్రవాసుల జీవిత మెంత దుర్భరమో తెలుస్తుంది. మార్క్సు కుటుంబాన్ని దుర్భరదారిద్ర్యం పీడించుతూండేది. ఏంజిల్సు స్వార్థమును త్యజించి, నిరంతరం అతనికి ధనసహాయం చేస్తూవుండేవాడు. ఆతని సాయమే లేనిచో మార్క్సు 'కాపిటల్' అను మహాగ్రంథాన్ని పూర్తిగావించలేక పోవడమే గాక లేమిచే క్రుంగి నాశనమైయుండేవాడని చెప్పవచ్చును. శ్రామికవర్గేతరములైన పెట్టీ-బూర్జువా సోషలిస్టు సిద్ధాంతా లా కాలంలో బహుళప్రచారంలో వుంటూండేవి. మార్క్సు వాటినన్నిటినీ నిరంతరం నిర్దాక్షిణ్యంగా, నిస్సంకోచంగా ఖండించవలసివస్తూండేది. అంతేగాక యనేకులైన వ్యక్తులనుగూడ నిర్మొగమాటంగా విమర్శించవలసివస్తూండేది. (దీనికి ఒక్క నిదర్శనం, కారల్ వాగ్ట్ (1817-95) అనే జర్మన్ ప్రజాతంత్రవాదిని విమర్శించి, ఆతనికిని 3 వ నెపోలియన్‌కును గల సంబంధాల్ని వెల్లడించేడు.) ఇతరప్రవాసులతో కలిసి మెలసి వృధాకాలక్షేపం చేయక, మార్క్సు తన కాలాన్నంతనీ

అర్థశాస్త్రప్రకరసమునందు వినియోగపరుస్తూ, భౌతికవాదాన్ని అనేకరీతులుగా బలపరుస్తూండేవాడు. ఈ కాలంలో ఆయన రచించిన చారిత్రకగ్రంథాలన్నీ భౌతికవాదదృష్టిలోనుండి భౌతికవాదాన్ని సప్రమాణంగా ఋజువుచేయడానికి సాయపడినాయి. ప్రధానంగా అర్థశాస్త్రమందు మార్క్సు సిద్ధాంతాలు గొప్పవిప్లవాన్ని తెచ్చినాయి. 1859లో 'అర్థశాస్త్రవిమర్శ' అనే గ్రంథాన్నీ, 1867లో 'కాపిటల్' అనే మహాగ్రంథాన్నీ మార్క్సు రచించేడు. ఆయన సిద్ధాంతాలు యీ గ్రంథాల్లో క్రోడీకరించబడ్డాయి.

1855 - 1865 మధ్యలో ప్రజాతంత్రోద్యమాలు యూరోపు నందంతటా తిరిగి తలలెత్తసాగినాయి. మార్క్సు వెంటనే రాజకీయరంగంలో వురికేడు. 1864 సెప్టెంబరు 28 న లండన్ నగరంలో 'అంతర్జాతీయ కార్మికసంఘం' స్థాపించబడింది. ఇదే సుప్రసిద్ధమైన 'ఫస్టు యింటర్నేషనల్'. దీనికి మార్క్సు మహాశయుడే గుండెకాయవంటివాడు. దాని తరఫున ప్రకటించిన మొదటిసందేశాన్ని ఆయనే తయారుచేసేరు. ఇంటర్నేషనల్ యొక్క తీర్మానాలు, ప్రకటనలు, ప్రణాళికలు మొదలైన వాటి కన్నింటికీ మార్క్సు మేధాశక్తియే నిర్మాత. వివిధదేశాల శ్రామికోద్యమాల నేకం గావించడం; మార్క్సుకు ముందున్నట్టి శ్రామికవర్గేతర సోషలిస్టు వుద్యమాలన్నీ కలిసి పనిచేయునట్లు చేయడం; (మాజినీ, ప్రౌధన్, బకునిన్ మొదలైనవారి వుద్యమాలు, యింగ్లాండులోని లిబరల్ ట్రేడ్ యూనియనిజమ్,

జర్మనీలోని లాసెల్లియన్‌లలో మితవాదుల చంచలోద్యమము మొదలైన వన్నీ యీ రకపువే.) ఈ అన్ని కక్షలయొక్కా, పక్షాలయొక్కా సిద్ధాంతాల్ని తీవ్రంగా ఖండించే కార్య క్రమంతోబాటు మార్క్సు ప్రపంచమందన్ని దేశాల కార్మికుల పోరాటాలకూ అనుకూలమైన యేకైక విశాలకార్యక్రమాన్ని తయారుచేసేడు. ఇందులోనే యాతని యసమానప్రతిభ వెల్లడి యవుతూంది. 1871 మే లో "పారిస్ కమ్యూన్" భగ్నమై పోయింది. కార్యవాదికి, విప్లవకారునికీ సహజమైన బుద్ధిప్రతిభ తోనూ, సూక్ష్మపరిశీలనాదృష్టితోనూ 'పారిస్ కమ్యూన్' ఓడి పోడానికి గల కారణాలను విశదంగా, వివరంగా మార్క్సు '1871 ఫ్రాంసు అంతర్యుద్ధం' యనే గ్రంథంలో పొందుపరచేడు.♦ ఆ కాలంలోనే బకునిన్ అనుయాయులు ఇంటర్నేషనల్‌లో చీలికలను దెచ్చేరు. కమ్యూన్ భగ్నమైపోయి ఇంటర్నేషనల్‌లో తీవ్రవిభేదా లేర్పడిన పిదప యీ సంస్థ ప్రధానస్థానాన్ని యూరపులో నుంచడానికి వీలులేకపోయింది. 1872 లో ఇంట ర్నేషనల్ కాంగ్రెస్ హేగ్‌లో జరిగినప్పుడు కేంద్రసంఘకార్యా లయాన్ని న్యూయార్కునగరానికి మార్చాలనే తీర్మానాన్ని*

♦ పారిస్ కమ్యూన్ భగ్నమైనతోడనే 1871 మే 30వ తేదీని ఇంటర్నేషనల్‌యొక్క జనరల్ కౌన్సిల్ కోరికపై మార్క్సు ఒక దీర్ఘో పన్యాసాన్ని యిచ్చేడు. కమ్యూన్ ఓడిపోడానికి కారణాలను యీ వుప న్యాసంలో విపులీకరించేరు. దానికే తరువాత యీ పేరు యిచ్చేరు.

* 1876 జూలై 15 తేదీని ఇంటర్నేషనల్ యొక్క ఆఖరు కాంగ్రెస్ ఫిలడెల్ఫియా నగరంలో జరిగింది. ఆ కాంగ్రెస్‌లోనే ఇంటర్నేష నల్ యథావిధిగా యెత్తివేయబడింది. స్టెక్‌లోఫ్ వ్రాసిన 'మొదటి ఇంట ర్నేషనల్ చరిత్ర' అనే పుస్తకంలో యిది తెలియగలదు.

మార్క్సు ప్రతిపాదించి నెగ్గించేడు. అటుతర్వాత కార్మికోద్యమం ప్రపంచమంతటా కార్చిచ్చులా చెలరేగింది. జాతీయప్రభుత్వాలుగల దేశాలన్నిట్లోనూ సోషలిస్టు లేబర్‌పార్టీ లేర్పడినాయి. కార్మికోద్యమం విస్తృతమవుతూ తన కార్యరంగాన్ని విశాలపరచుకొనసాగినట్టి యుగానికి తావిచ్చి మొదటి యింటర్నేషనల్ తన చారిత్రక పాత్రను నిర్వహించింది.

ఇంటర్నేషనల్ కొరకై నిరంతరం శ్రమపడడం వల్లనూ, అంతకు మిక్కిలిగా సిద్ధాంతపరిశోధనలో గావించిన నిరంతర మనోపరిశ్రమ చేతను మార్క్సు ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అనారోగ్యస్థితిలోకూడ నాతడు అర్థశాస్త్రాన్ని పఠిస్తూ, రష్యను మొదలైన భాషలను నేరుస్తూనేవుండేవాడు. 'కాపిటల్' మహాగ్రంథాన్ని పూర్తిచేయడానికై ఆయన యెన్నో గ్రంథాల్నీ, యెన్నో విశేషాంశాల్నీ సేకరించి, రాత్రింబవళ్ళు పరిశ్రమ చేస్తూనేవుండినా రుగ్మతమాత్రం ఆయన నా గ్రంథాన్ని పూర్తిగావించనీయనే లేదు.

మార్క్సు మహాశయుని భార్య, పరమసాధ్వియైన జెన్నీ 1882 డిసెంబరు 2వ తేదీని మరణించింది. 1883 మార్చి 11వ తేదీనే మార్క్సుకూడ పడకకుర్చీలో కూర్చొని వుండే ప్రశాంతంగా జీవితమును చాలించేరు. ఆయన ప్రియభార్యయొక్కా, వారి కుటుంబంలోనిదే యనదగు ప్రియపరిచారిక హెలినీ డీ ముత్ యొక్కా సమాధుల ప్రక్కనే, లండన్‌లోని హైగేటు సిమెటరీలో మార్క్సు భౌతిక దేహాన్ని సమాధిచేసేరు.

# మార్క్సు ఉపదేశాలు.

మార్క్సు అభిప్రాయాల, బోధనల క్రమాన్నే 'మార్క్సిజం' అంటారు. 19వ శతాబ్దంలో ప్రపంచమంతటికీ తత్త్వశాస్త్రంలో జర్మనీ, అర్థశాస్త్రంలో యింగ్లాండు, సామాజిక శాస్త్రానికి ఫ్రాన్సు ప్రామాణికములై వుత్తమస్థానాన్ని ఆక్రమించివుండేవి. ఈ మూడు దేశాల సిద్ధాంతభావపరంపరనూ కొనసాగించి గమ్యస్థానానికి తెచ్చిన యుగ్యోతియమేధావీ, మహాపండితుడూ కారల్ హీన్‌రిమ్ మార్క్సు. ఆయన సిద్ధాంతాల్లోని జీవమును, క్రమబద్ధతను, భావైక్యతను ప్రతికక్షులుకూడ అంగీకరించేరు. అటువంటి మార్క్సియన్ సిద్ధాంతాల పూర్ణరూపమే గతితార్కికభౌతికవాదమూ, శాస్త్రీయసోషలిజమూ మైయున్నాయి. ప్రపంచంలోని నాగరిక దేశా లన్నిటి కార్మికోద్యమంయొక్క సిద్ధాంతం, కార్యక్రమం చేరి 'శాస్త్రీయ సోషలిజమ్' అవుతూంది. మార్క్సిజంలో ప్రధానభాగమైన ఆర్థికసిద్ధాంతాన్ని గూర్చి చెప్పడానికి ముందు మార్క్సుయొక్క 'విశ్వభావన'ను గురించి వివరించడం చాల అవసరం.

# తాత్త్వికభౌతికవాదం

1844 - 45 నాటికే మార్క్సు భావాలు ఒకరూపం దాల్చినాయి. ఆనాటికే ఆతడు భౌతికవాదాన్ని బలపరుస్తూ, ఫ్యూయర్‌బాహ్ అనుయాయుల్లో ముఖ్యుడుగా వుండేవాడు. తరువాత క్రమంగా ఫ్యూయర్‌బాహ్ భౌతికవాదంలో

అసమగ్రత, అసంబద్ధత యనే లోపాలున్నాయనీ మార్క్సు గ్రహించేడు. హెగెల్ భావవాదాన్ని స్పష్టంగా నిరాకరించి, పద్దెనిమిదో శతాబ్దంలోనే ఫ్రాన్సు మొదలైన దేశాల్లో అప్పటి ఆచరణలోనున్నట్టి రాజకీయసంస్థలతోను, మతసిద్ధాంతాలతోను, ఆస్తికవాదంతోనూ మాత్రమేగాక అన్నివిధాలైన తత్త్వసిద్ధాంతాలతోనూకూడ పోరాటాన్ని సాగించి, భౌతికవాదాన్ని యెలుగెత్తి ప్రకటించడంచేసనే ఫ్ర్యాయర్‌బాహ్‌కు చరిత్రాత్మకమైనట్టిన్నీ, నూతనశకారంభకమైనట్టిన్నీ ప్రాధాన్యత వుందని మార్క్సు అభిప్రాయం.

'కాపిటల్' మొదటిసంపుటం యొక్క రెండో కూర్పు పీఠికలో మార్క్సు యిట్లు వ్రాసియున్నాడు: "ఆలోచనా క్రమమే యీ దృశ్య ప్రపంచనిర్మాత యని హెగెల్ పండితుని సిద్ధాంతము. ఆలోచనాక్రమాన్నే ఆయన ఒక స్వతంత్రశక్తిగా పరిగణించి 'భావ' మని పేర్కొన్నాడు. కాని 'పదార్థం' మానవుని మెదడులో ప్రతిబింబించి, వికసత్వమును పొందుతే 'భావం' అని నా అభిప్రాయము." (హెగెల్ ముఖ్యసిద్ధాంతానికి మార్క్సు అభిప్రాయం కేవలం వ్యతిరేకం. అనువాదకుడు.)

మార్క్సుయొక్క భౌతికవాదసిద్ధాంతాల్ని బలపరుస్తూ, యేంజిల్సు తన అభిప్రాయాల్ని 'యాంటీ- డుహింరింగ్' * అనే గ్రంథంలో స్పష్టీకరించేరు.

'ఈ విశ్వంయొక్క వునికిలో దాని ఐక్యత ఋజువు కావడంలేదు. .. విశ్వంయొక్క నిజమైన ఐక్యత దాని భౌతికత్వంలోనే వుంది. ప్రకృతిశాస్త్రం

* డుహ్రింగ్ అనే జర్మను తత్త్వవేత్త సిద్ధాంతాన్ని ఖండిస్తూ యేంజిల్సు వ్రాసిన గ్రంథమే 'యాంటీ- డుహ్రింగ్' మార్క్సు దీని వ్రాతప్రతిని మాత్రమే చూచేడు.

యొక్కా, తత్త్వశాస్త్రంయొక్కా సుదీర్ఘక్రమవికాసమే యీ విషయాన్ని నిరూపించివుంది...చలనం అనేది పదార్థంయొక్క అస్తిత్వవిధానమే. చలనం లేని పదార్థం యింతవర కెప్పుడూ, యెక్కడా వుండిందేలేదు, వుండజాలదు కూడాను...చలనం లేని పదార్థం యెట్లు వూహించలేమో అట్లే పదార్థం లేనిదే చలనంకూడా అనూహ్యం. ...... ఆలోచన, చైతన్యం, అంటే యేమిటి? అవి యెక్కడినుండి వచ్చేయి? అనేవి మనం విచారిస్తే మన కేమి సమాధానం వస్తుంది? మానవుని మెదడులోనుంచే ఆలోచన, చైతన్యం అనేవి పుట్టినవనీ, ఆ మానవుడుకూడ ప్రకృతిలో పుట్టినవాడేననీ తెలుస్తుంది. మానవుడు ప్రకృతిలో జనించి, తన పరిసరాలలో, పరిసరాలతో బాటుగా యభివృద్ధికొందుతూన్నాడు. ఏతావతా తేలిన సారాంశ మేమిటి? మానవుని మెదడువల్ల వుద్భవించిన ఆలోచన, చైతన్యం వగైరాలన్నీకూడా ప్రకృతి జన్యములే యని చెప్పకతప్పదు. పరిశీలిస్తే ఆఖరి కివియన్నీ ప్రకృతిలోని యితరవిధానాలతో యెంతమాత్రం భేదంగా వుండక పోనడమేగాక వాటితో అన్నివిషయాల్లోనూ అనుసరిస్తూనేవుంటాయి.'

మానవుని ఆలోచనా విధానం ప్రకృతిలోని యితరవిధానాలతో తత్త్వతః భిన్నమైనదిగాదని అర్థము.

"హెగెల్ భావవాది. అంటే, అతని మెదడులోనున్న యాలోచనలన్నీ వాస్తవంగావున్న పదార్థాలయొక్కా, పరిణామాలయొక్కా కేవలప్రతిబింబాలు కావని ఆయనఅభిప్రాయం. అంతేగాక నిజానికి ప్రతిపదార్థమూ, ప్రతిపరిణామమూకూడా సృష్టికి ముందే యెక్కడనో వున్నట్టి 'భావము'కు ప్రతిబింబాలనేదే హెగెల్ ప్రధాన సిద్ధాంతం."

ఏంజిల్సు వ్రాసిన 'లూడ్విగ్ ఫ్యూయర్ బాహ్' అనే గ్రంథంలో ఫ్యూయర్ బాహ్ తత్త్వసిద్ధాంతాలమీద తన యొక్కా, మార్క్సుయొక్కా అభిప్రాయాల్ని వెల్లడించి

యున్నాడు. హెగెల్, ఫ్యూయర్‌బాహ్‌లు; చరిత్రయొక్క- ఆధిభౌతిక భావన,- మొదలైన విషయాల్ని గూర్చి 1844-45 లోనే తానూ, మార్క్సు వ్రాసిన వ్రాతప్రతిని చూసి, ఏంజిల్సు అచ్చువేయించేడు. 'లూడ్విగ్ ఫ్యూయర్‌బాహ్' అను శీర్షిక క్రింద ఏంజిల్సు యిల్లా వ్రాసేడు:

'తత్త్వశాస్త్రాలన్నిటికీ, అందులోనూ ముఖ్యంగా ప్రస్తుత తత్త్వశాస్త్రాలన్నిటికీ అత్యంతప్రధానసమస్య యేదంటే, 'పదార్థానికీ, భావానికీ గల సంబంధ మేది? ప్రకృతికిని, శక్తికిని సంబధ మేది? ...వీటిలో యేది ముందు: ఏది వెనుక? ప్రకృతి ముందా? శక్తి ముందా?' అనేదే. ఈ ప్రశ్నకు యిచ్చే జవాబునుబట్టే తత్త్వవేత్తలు రెండుపక్షాలుగా విభజింపబడివున్నారు. ప్రకృతికి ముందే శక్తి వున్నదనీ, ఏతావతా శక్తివల్లనే యీ ప్రకృతి సృష్టించబడిందనీ వాదించేవారు భావవాదులు లేక శక్తివాదులు. వీరిలో భేదాలున్నా వీరంతా ఒకపక్షం. ఇక రెండోపక్షంలో భౌతిక వాదంలోని వివిధశాఖలవారున్నారు. వీరంతా ప్రకృతే మొదటిదని చెప్తారు.'

భావావాదం, భౌతికవాదం, అనే మాటలను తత్త్వశాస్త్రంలో మరో అర్థంలో వుపయోగిస్తే గందరగోళంగా వుండకతప్పదు. ఇది గమనించాలి. ఏదోఒక రూపంలో మతాలతో సంబంధం కలిగివుండే భావవాదాలనుమాత్రమే ఖండించి వూరుకోకండా, మార్క్సు ప్రత్యేకంగా యీనాడు విరివిగా ప్రచారంలోనున్న హ్యూమ్, కాంట్‌ల భావవాదాలను, అనిశ్చయవాదం, విమర్శావాదం, వివిధరూపాల్లోనున్న నిశ్చయ వాదం (కాస్టే సిద్ధాంతాలు) మొదలైనవాటినికూడ తీవ్రంగా ఖండించేవాడు. ఇట్టి తాత్త్వికవాదాలన్నీ కడపట భావవాదానికి

లోంగునవై, /అభివృద్ధినిరోధకంగా వుంటాయని మార్క్సు వుద్దేశ్యం. వీటిలో బహు(శ్రేష్టతమవిధానంకూడా పైకి భౌతిక వాదాన్ని బాహాటంగా నిరాకరిస్తూనే, తిరిగి దానిని తమ సిద్ధాంతాల్లోకి పెరటిదోవినను తెస్తూoదనీ, అది సిగ్గుపడాల్సిన విషయమనీ మార్క్సు అభిప్రాయము. (ఈ సందర్భంలో మార్క్సు, ఏంజిల్సుల గ్రంథాల్లో పైన వుదాహరించిన వాటినే గాక 12 డిసెంబరు 1866 న మార్క్సు మహాశయుడు ఏంజిల్సుకు వ్రాసిన వుత్తరాన్నికూడా చూడాలి.– 'సుప్రసిద్ధుడైన టి. హాక్స్లే యనే ప్రకృతిశాస్త్రవేత్త 'గత కొద్దియేండ్లలోనూ చూపినకంటె యెక్కువ భౌతిక దృష్టిని కనపరుస్తూ' యిట్లా ప్రకటిస్తున్నాడు: 'మనం నిశ్చయంగా పరిశీలించిచితే, ఆలోచిస్తే, భౌతికవాదాన్ని కాదనజాలం.' ఈభాషితాన్ని చూసి 'అనిశ్చయ వాదానికీ, హ్యూమిజమ్‌కూ ఆక్షేపించుటకు మరో దిడ్డిదోవిన తెరచేడు,' అని మార్క్సు వ్రాసేను.)

ఇక స్వేచ్ఛకును, ఆవశ్యకతకునుగల సంబంధాన్ని గూర్చి మార్క్సు అభిప్రాయాన్ని తెలుసుకోడం ముఖ్యం. 'ఆవశ్యకతను గుర్తించడమే స్వేచ్ఛ. గుర్తించబడనంతవరకు ఆవశ్యకత గుడ్డిదే' నని యేంజిల్సు యాంటీ-డుహ్రింగ్‌లో వ్రాసేడు. అంటే ప్రకృతినియమాల బలాన్ని. వాస్తవిక శాసనాన్ని గుర్తించి, ఆవశ్యకత స్వేచ్ఛగా గతితార్కిక-కరీత్యా పరిణామం జెందడాన్ని గ్రహించాలి. (తెలియబడనిదిగానే యుండినీన్ని తెలుసుకొనే విలుగలదైన యీ 'స్వయంపదార్థా'న్ని 'మనకొరకైన

పదార్థం'గాను, 'సర్వపదార్థసారం' 'దృశ్యవిషయం' గాను మారడాన్ని కూడా మనం గుర్తించాలి.)

పురాతన భౌతికవాదంలోని యీ క్రింది పెద్దలోపాల్ని మార్క్సు, ఏంజిల్సులు సూచించేరు. (ఫ్యూయర్‌బాహ్ భౌతికవాదాన్నేగాక బుక్నర్, వాగ్ట్, మోలెస్కాట్ మొదలైనవాళ్ళ అపభ్రంశపు భౌతికవాదాల్ని కూడ పూర్తిగా ఖండించేరు.)

1. రసాయన, జీవశాస్త్రాలలో కలిగిన కడపటి యభివృద్ధులను పరిగణించకపోవడంవల్ల భౌతికవాదం కేవలం యాంత్రికంగానే వుంది. (నేడు పదార్థవిద్యుత్ సిద్ధాంతాన్ని కూడ అది వుపేక్షించిందని చెప్పవచ్చును.)

2. భౌతికవాదం చరిత్రను పరిగణనకుతీసికోక, గతితర్కానికి వ్యతిరేకంగా వుంటూ పరిణామానికీ, పదార్థానికీ, అతీతమైనదిగా నటిస్తూ, మెటఫిజికల్‌గావుంటూ) పరిణామసిద్ధాంతాన్ని సర్వతోముఖంగా, సుసంగతంగా వర్తింపజేయలేకపోయింది.

3. ఇది మానవస్వభావాన్ని నిరపేక్షకమని తలంచింది. అంటే పరిసరాలతో సంబంధం లేనిదాన్నిగా మానవప్రవర్తనను భావించింది. అల్లాకాకండా నిర్ణీతములు, నిశ్చితములు ఐన సామాజిక చారిత్రక సంబంధాల సమ్మేళనాఫలితంగా మానవస్వభావం మారునని చెప్పలేదు.

ఈ విధంగా ప్రపంచానికి 'అర్థం' మాత్రమే చెబుతూ ప్రపంచాన్ని మార్చే సమస్యనుగూర్చి పట్టించుకోనేలేదు.

ఆచరణసాధ్యమైన విప్లవకార్యాచరణయొక్క ప్రాముఖ్యతను గుర్తించజాలక, శక్తిహీనమై వుండిపోయింది.

## గతితర్కం

హెగెల్ గతితర్కసిద్ధాంతం, పరిణామవాదంకూడా సమగ్రమైనవీ, సంపూర్ణమైనవీ, గంభీరమైనవీ మాత్రమేగాక విషయపరిజ్ఞానం కలవనిగూడా మార్క్సు, యేంజిల్సులు అభిప్రాయపడ్డారు. ప్రామాణిక జర్మన్‌తత్త్వశాస్త్రంయొక్క శిరోభూషణంగా యీ సిద్ధాంతం వున్నదని వారు భావించేరు. అభివృద్ధి పరిణామాలనుగూర్చిన యితర సూత్రవివరణలన్నీ విషయదారిద్ర్యం గలవై, పాక్షికములు మాత్రమేగాక ప్రకృతి సమాజముల పరిణామగతినిగూర్చి తప్పుటభిప్రాయాల్ని గలిగించేవిగా వున్నాయి. (సమాజపరిణామగతి తరచుగా విప్లవాలతోనూ, పతనోత్పతనాలతోనూ, గంతులు- దాట్లుతోనూ పూర్ణత చెందుతూంటుందని వారి యభిప్రాయం.)

"విచక్షణాయుతమైన గతితర్కాన్ని హెగెలియానిజమ్ మొదలైన భావవాదజంబాలాన్నుంచి బైటికితీసి, ప్రాకృతికభౌతికవాదంతో సమన్వయించడంద్వారా రక్షించింది నేనూ, మార్క్సున్నూ ... గతతర్కానికి గీటురాయి ప్రకృతే. ప్రకృతిశాస్త్రజ్ఞానం యీ పరీక్షకు కావలసిన పరికర సముదాయాన్ని దినదినాధికంగా సమకూరుస్తూంది. గతితర్కసూత్రాల ననుసరించే ప్రకృతి పరిణామం జెందుతూంది గాని తాత్త్వికసిద్ధాంతరీత్యా గాదని ఆఖరుపరిశీలనలో శాస్త్రవిజ్ఞానం బుజువుచేస్తుంది.' (ఈ విషయాలన్నీ

రేడియాం, ఎలక్ట్రాన్లు, మూలపదార్థాల నొకదాని నింకొకటిగా మార్చడం మొదలైనవి కనిపెట్టక ముందే వ్రాసేరు.)

ఈ విషయమై ఏంజిల్సు యింకా యిట్లు వ్రాస్తున్నారు:

'ఈ జగత్తు పూర్ణరూపం పొందిన స్థిరమైన వస్తువుల సమూహం గాదనీ, నిత్యమూ మార్పుజెందుతుండే అసంఖ్యాక పరిణామక్రమాల సమాహారమనీ తెలుసుకోడం ముఖ్యం. ఈ పరిణామాలయందుకూడ స్థిరమైనవిగా కన్పించే వస్తువులనుగూర్చిన మన యభిప్రాయాలున్నూ మానవుల మెదడుల్లో వాటిప్రతిబింబాలు లేక వస్తువులనుగూర్చిన మనయభిప్రాయాలున్నూ నిరంతరం మార్పులుజెందుతూనే వుంటాయి. ఒకచోట హైకికనిపించుతూ, మరొకచోట మాయమవుతూ, మార్పు హఠాత్తుగా కలుగుతున్నట్లూ, అనేక మార్పులు జెందుతూ ఒక్కొక్కప్పుడు వెనుకకుపడుతున్నట్లు గాన్పించుతూవున్నా యెల్లప్పుడూ అభివృద్ధిమార్గంలో నేవికాసాన్ని జెందుతూ యీపరిణామక్రమాలు పరిణతిజెందుతూంటాయి... ఈ సిద్ధాంతం చాలాకాలాన్నుంచీ, అందులోనూ హెగెల్ కాలాన్నుంచీ సాధారణవిచక్షణాశక్తిగల వారందరిలోనూకూడా వ్యాపించివుంది. దీని సాధారణరూపాన్ని యెవరూ యెదిరించరు. కాని యీ సిద్ధాంతాన్ని మాటల్లో అంగీకరిండం ఒక యెత్తున్నూ, దాన్ని ప్రతిసమయమందు, ప్రతి పరిశోధనారంగమందూ ఆచరణలో బెట్టడం మరో యెత్తున్నూ ఐవుంది.'

'గతితార్కికదృష్టిలో యే వస్తువూ శాశ్వతమైనది గాదు, సంపూర్ణమైనదీ గాదు; పవిత్రమైనదీ కాదు. ప్రతివస్తువులోనూ, ప్రతివస్తువునిూదనూ తప్పనిసరైన క్రమవినాశనముద్రను గతతర్కం చూస్తూనేవుంది. ఎడతెగని జననమరణాలతోగూడినదై, అధోస్థితినుండి వున్నతస్థితికి నిరంతరాయంగా పోతూవుండే 'గమనపద్ధతికి' మాత్రం యీ గతితార్కికభౌతికవాదం వర్తించదు. ఎంచేతనంటే గతితార్కికభౌతికవాదమంటే, ఆలోచనాశక్తిగల మెదడునందు జగత్తుయొక్క యీ గమనపద్ధతి ప్రతిబింబమే తక్క మరేదీగాదు.'

ఈ విధంగా, గతితర్కమంటే 'బాహ్యప్రకృతియొక్క,

మానవులభావనాశక్తియొక్క సాధారణగమనసూత్రాలను దెలియజేయు శాస్త్రం' అని మార్క్సు అభిప్రాయము.

హెగలియన్ తాత్త్విక సిద్ధాంతాల్లో విప్లవకరమైన వాటిని స్వీకరించి మార్క్సు చాల అభివృద్ధిచేసేడు. గతితార్కిక భౌతికవాదానికియితరవిజ్ఞానశాస్త్రాల కతీతమైన వాటిని కలదన్నే తాత్త్విక సిద్ధాంతాలేమీ అవసరంలేదు. పూర్వపు తత్త్వశాస్త్రాల తాలూకు 'ఆలోచనాపద్ధతిని గురించిన శాస్త్రం, దాని సూత్రాలు, అంటే మామూలు తర్కశాస్త్రం, గతి తర్కం' మాత్రమే యిది తీసుకొంది. 'గతితర్కం' అనే మాటను మార్క్సు, హెగెల్ ననుసరించే వుపయోగించేడు. 'గ్రహణసిద్ధాంతం' లేక 'విజ్ఞానవాదం' అని యిప్పుడు పిలువబడుతూన్నది గతితర్కంలోని భాగంమాత్రమే. అజ్ఞానదశలో నుంచి విజ్ఞానదశలోనికి అభివృద్ధిజెందుటను అంటే విజ్ఞాన ప్రారంభం, అభివృద్ధి, వాటి పద్ధతుల్ని శాస్త్రీయంగా, చారిత్రకంగా అన్వేషిస్తూ, పాఠ్యక్రమంలో యీ విషయాలనే కలిగియున్న శాస్త్రాన్నే 'విజ్ఞానవాదం' లేక 'జిజ్ఞాసావాదం' అని పిలుస్తారు. క్రమాభివృద్ధి, పరిణామం, అనే భావాలిప్పుడు సర్వసాధారణవిచక్షణాశక్తిలో నాటుకుపోయినాయి. ఇది హెగెల్ సిద్ధాంతాలవల్లగాక యితరమార్గాల ద్వారానే జరిగింది. కాని, హెగలియన్ తత్త్వశాస్త్రము నాధారం చేసుకొని మార్క్సు, ఏంజిల్సులు సూత్రీకరించినట్టి పరిణామ సిద్ధాంతము, ప్రస్తుతం వాడుకలోనున్న పరిణామసిద్ధాంతముకన్న

సంపూర్ణమైనదీ, బహుముఖమైనదీ నైయుంది. ఈ యభివృద్ధి యనేది వెనుకటి ఘట్టాలనే చర్వితచర్వణం చేస్తూన్నట్లు కన్పడుతూంటుందే కాని యదార్థానికి తద్భిన్నంగా, వున్నత దశలోనే పోతూంటుంది. ఈ అభివృద్ధి సరళమైన వృత్తాకారంలోగాక క్రమోన్నతంగా వుండే శంఖావర్తరేఖలో జరుగుతూంటుంది. అంతేగాదు. ఇది వురకలు, దాట్లు వేస్తూ, విప్లవాలు వినాశాలు,- వీటితో గూడుకొని వుంటుంది; మధ్య మధ్య సక్రమంగాకూడ నడుస్తూంటుంది. పాదార్థికపరిమాణం అధికతరమై గుణభేదానికి కారణమవుతూంటుంది. ఒక నిర్దిష్ట సమాజంలో కాని, వ్యక్తిలో కాని, దృశ్యవిషయంలో గాని అంతర్గర్భితంగా పనిచేస్తూండే వివిధశక్తుల, నైఖరుల మధ్య జరిగే సంఘర్షణా, వైరుధ్యములు దానిలోనుంచే అభివృద్ధిశక్తులను వుద్భవింపజేస్తున్నాయి.

ప్రతి దృశ్యవిషయంలోనూ వున్న అనేక భాగాలు పరస్పరాధారాధేయములై, వాటిమధ్య విడదీయ వీలులేని సామీప్యసంబంధం వుంటుంది. ప్రకృతియొక్క వివిధభాగాలలో యీ సంబంధమే నియమానుసారమైన విశ్వగమనాన్ని కలిగిస్తూంది. పరిణామసిద్ధాంతంగా గతితర్కాన్ని చూస్తే మనకి కనిపించే వాటిలో కొన్ని లక్షణాలు యిట్టివిగా వున్నాయి. ప్రస్తుతం సాధారణంగా వాడుకలోనున్న దానికంటె యిది యెక్కువ సమగ్రంగా వుంటుంది. (1868 జనవరి 8 తేదీని మార్క్సు యేంజిల్స్‌కు వ్రాసిన లేఖను చూడండి. దానిలో

ఆయన స్టీన్ సిద్ధాంతాల్ని ఖండిస్తూ వ్రాసేడు. స్టీన్ సిద్ధాంతాన్ని గతితార్కికభౌతికవాదంగా భావించడం శుద్ధతెలివి తక్కువే.)

## చరిత్రయొక్క భౌతికభావన

వెనుకటి భౌతికవాదంలోని అసంబద్ధత, అసమగ్రత, పాక్షికదృష్టి మొదలైన లోపాల్ని తెలిసికొని మార్క్సు, 'భౌతికవాదానికి సామాజికశాస్త్రంతో సామరస్యం కలుగజేసి, భౌతికవాదపునాదులపై సామాజికశాస్త్రాన్ని పునర్నిర్మించడం' అవసరమని నిశ్చయించేడు. మొత్తంమీద చూస్తే భౌతికవాద సిద్ధాంతం ప్రకార 'చైతన్యం' వుందీ అంటే దానికి అనుకూలమైన భౌతికపరిస్థితులు యిదివరకే యేర్పడివున్నాయని అర్థం. అంతేకాని చైతన్యం భౌతికపరిస్థితుల్ని నిర్మించుతుందని కాదు. ఈ సూత్రాన్ని మానవుని సామాజికజీవితానికి వర్తింపజేస్తే తేలేదేమంటే, సామాజికపరిస్థితులనుబట్టే మానవుని చైతన్యం నిర్ణయించబడుతూందని. 'కాపిటల్' ప్రథమసంపుటంలో మార్క్సు యిట్లువ్రాసేడు: "ప్రకృతితో మానవుని సంబంధాల్ని తెలుపుతూ, మానవజీవితావసరముల వుత్పత్తిస్థితిని వెల్లడిస్తూ, సామాజికసంబంధాల్నీ, తత్ఫలితాలైన మనోభావాలనూ, ప్రవృత్తులనూ విశదీకరిస్తూంటుంది, సాంకేతికవిజ్ఞానం లేక టెక్నాలజీ."

మార్క్సు తన 'అర్థశాస్త్రవిమర్శ' అనే గ్రంథం యొక్క పీఠికలో మానవసమాజానికీ, చరిత్రకీ భౌతికవాద మూలసిద్ధాంతాల్ని వర్తింపజేసిన విధానాన్ని యీ క్రిందిరీతిగా వ్రాసేడు.:

"జీవితావసరవస్తువులకొరకైన సామాజికోత్పత్తిలో మానవులు నిశ్చితములు, అవసరములు ఐన పరస్పరసంబంధాలను కలిగివుంటారు. ఈ సంబంధాల్ని కలిగివుండడానికి గాని, మానడానికి గాని వ్యక్తుల యిష్టానిష్టాలతో పనివుండదు. ఈ వుత్పత్తిసంబంధాలు ఆయా కాలాల్లోని వుత్పత్తిశక్తుల అభివృద్ధిదశనుబట్టే నిర్ణీతము లవుతూంటాయి. సంఘంలోని వుత్పత్తిసంబంధాల మొత్తమే అప్పటి ఆర్థికనిర్మాణస్థితిని యేర్పరుస్తూంటుంది. సంఘంయొక్క ఆర్థికనిర్మాణస్థితిమీద ఆధారితమయ్యే ఆ కాలపు న్యాయశాస్త్రాలు, రాజకీయసంస్థలు నిర్మింపబడుతూంటాయి. సామాజికచైతన్యం యొక్క వివిధదశలు వీటి కనుగుణ్యంగా వుంటాయి. అంటే సాధారణంగా జీవితావసరములైన భౌతికవస్తుసముదాయము నుత్పత్తిగావించుకొను విధానమే ఆయా కాలాల్లోని సామాజిక, రాజకీయ, మానసిక ప్రవృత్తులకు నిర్ణేతయై వుంటుందన్నమాట. ఆయా కాలముల యందుండే సామాజికపరిస్థితులే మానవునికి చైతన్యాన్ని కలుగజేస్తూన్నాయి గాని మానవుల చైతన్యం భౌతికపరిస్థితులను నిర్ణయించడంలేదు. సమాజంలోని భౌతికవుత్పత్తిశక్తులు అభివృద్ధి జెందుతూ ఒకానొక దశకు వచ్చేటప్పటికి అంతవరకూవున్న వుత్పత్తిసంబంధాలతో వాటికి సంఘర్షణ వస్తుంది. ఈ వుత్పత్తిశక్తుల యభివృద్ధి కంతవరకూ ప్రేరకములైవున్న వుత్పత్తిసంబంధాలు (యివే ఆస్తిసంబంధాలు కూడాను) వాటి యభివృద్ధికి ఆటంకములుగా మారిపోతాయి. అప్పుడే గొప్ప సామాజికవిప్లవమున కనువైనకాలం వచ్చినదన్నమాట. అన్నిటికినీ పునాదిగానున్న యార్థికవ్యవస్థమారినతోడనే దానిపైన నిర్మింపబడిన యితర పరిస్థితులన్నీ విపరీతవేగతో మారిపోతాయి. ఇల్లాంటి గొప్పమార్పుల్ని గూర్చి

ఆలోచించేటప్పుడు మనం రెండుముఖ్యవిషయాల్ని గుర్తుంచుకోవాలి. ప్రకృతి శాస్త్రపరిశోధనలలో యెంత సూక్ష్మపరిశీలనా, నిశితమేధా అవసరమో యీ మార్పు లేక విప్లవం గూర్చి ఆలోచించేటప్పుడుకూడ అంతటి సూక్ష్మపరిశీలనా, నిశితమేధా అవసరం. వస్తూత్పత్తియొక్క ఆర్థికవ్యవస్థలో కలిగే భౌతికమైన మార్పు ఒకటి; న్యాయ, రాజకీయ, మత, కళా, తత్త్వరూపాల్లో అంటే భావాత్మకరూపాల్లో కలిగే మార్పు మరొకటి. ఈ రెండోఘట్టంలోకి వచ్చేటప్పటికి మానవులు చైతన్యంతోనే యీ విప్లవాన్ని ఒకకొలిక్కి తేల్చడానికే పోరాడుతారు."

"ఒకవ్యక్తి తనను గురించి తలచుదాన్నిబట్టి యే విధంగా మన మాతని స్వభావాన్ని నిర్ణయింపమో అలాగే ఒక విప్లవయుగాన్ని గూర్చి నిర్ణయించేటప్పుడు మనం దాని స్వీయచైతన్యాన్ని గణనకు తీసుకోము. అంతేగాక యీ చైతన్యం, ఆ నిర్దిష్టసమాజంయొక్క భౌతికజీవితమందలి వైరుధ్యాలకు అంటే ఉత్పత్తిశక్తుల ఉత్పత్తిసంబంధాల మధ్యనుండే స్పర్ధలకు ఫలితమని చెప్పాలి. ......మొత్తంమీద ఆలోచించిచూస్తే మానవసమాజంయొక్క ఆర్థికవ్యవస్థలో నాలుగు ప్రధానఘట్టాలను మనం పేర్కొనవచ్చు: 1. ఆసియాలోని ఉత్పత్తివిధానము; 2. గ్రీసు, రోములలోని ఉత్పత్తివిధానము; 3. జమీందారీ లేక భూస్వామ్య ఉత్పత్తివిధానము; 4 ఆధునిక పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానము; యీ నాలుగూ ఉత్పత్తివిధానంలో అభివృద్ధికరఘట్టాలుగా చెప్పవచ్చును." (1866 జూలై 7 తేదీని యేంజిల్సుకు మార్క్సు వ్రాసిన జాబులోని యీ క్రింది సంక్షిప్తవివరణను పైదానితో పోల్చి చూడండి: 'కార్మిక నిర్మాణవ్యవస్థ ఉత్పత్తిసాధనాలచే నిర్ణయించబడుతూందనే మన సిద్ధాంతం.')

భౌతికవాదపరంగా చరిత్రను సమన్వయించుకోడం కనిపెట్టిన తర్వాత, అంటే భౌతికవాదాన్ని సామాజికచర్యలకి సమగ్రంగా అనువర్తింపజేయడం ప్రారంభించేక, వెనకటి చరిత్ర సిద్ధాంతాల్లోని ప్రధానలోపాలు రెండు తొలగించబడినాయి.

మొదటిది,- మానవులను చారిత్రకచర్యకు పురిగొల్పే ఆదర్శా లను గురించే ఆలోచించేరు గాని యీ ఆదర్శాలకు మూల కారణ మేమిటనే విషయాన్ని పూర్వచరిత్రకారులు విచా రించనేలేదు. అంతేగాక సామాజికసంబంధాల వికాసం, కొన్ని నియమాలకు లోబడి, వాటి ననుసరించి నడుస్తూంటుందనీ, సామాజికసంబంధాల అభివృద్ధికూడా భౌతికవుత్పత్తివిధానాభి వృద్ధియొక్క దశ ననుసరించే వుంటుందనీ కూడ వారు గ్రహిం చనేలేదు. రెండోది,- పూర్వపు చారిత్రకసిద్ధాంతాలు ప్రజా సామాన్యంయొక్క పాత్రను నిర్లక్ష్యంచేసినాయి. కాని చారి త్రక భౌతికవాదం మాత్రం ప్రజాసామాన్యంయొక్క జీవితపరిస్థి తులను, వాటిలో కలుగు మార్పులనూకూడ శాస్త్రోచితమైన సూక్ష్మతతో అధ్యయనం చేయడాన్ని సాధ్యంచేసింది.

మార్క్సుకు ముందున్న సామాజికశాస్త్రం, చరిత్ర రచనాశాస్త్రంకూడా అసమగ్రసత్యాల్ని అక్కడక్కడప్రోగుచేసి పెట్టినాయి; చారిత్రకగతియొక్క వివిధఘట్టాల్ని వర్ణించినాయి మానవసమాజంలోవున్న పరస్పరప్రతికూలధోరణులమొత్తాన్ని పరిశీలించి, సమాజంలోని వివిధవర్గాల జీవితవిధానాన్నీ వస్తూ త్పత్తివిధానాన్నీ స్పష్టంగా నిర్వచించుట కనువైన పరిస్థితుల్లోకి సూక్ష్మీకరించియు; వివిధములైన ప్రధానభావాల నెంచుకొన డంలోగాని, వాటిని విమర్శించి, విశదీకరించడంలోగాని వ్యక్తి వాదాన్నీ, స్వేచ్ఛాసంకల్పవాదాన్నీ ఖండించియు; ఉత్పత్తి

విధానంలో భౌతికశక్తుల పరిస్థితుల్నిబట్టియే మానవులలో భావాలు, ధోరణులు సంభవిస్తాంటాయని చూపేరు; ఆర్థిక సామాజిక భావసాధముల నిర్మాణ, అభివృద్ధి క్షీణతలను గురించి తెలుసుకోడానికి సమగ్రమూ, సర్వతోముఖమూ నైన మార్గాన్ని మార్క్సుజం వెల్లడిచేసింది. ప్రజలు తమ చరిత్రకు తామే కారకులు. ప్రజాసమూహాలయొక్క అభిప్రాయాలను నిర్ణయించే దేది? పరస్పరవిరుద్ధభావముల, ప్రయత్నముల సంఘర్షణకు కారణ మేది? విశ్వమానవసంఘంలో వుండే యీ సంఘర్షణల మొత్తానికి ఫలితమేమి? మానవుని చారిత్రక చర్యకు మూలాధారములైనట్టిన్నీ, జీవితాని కత్యవసరమైనట్టిన్నీ భౌతికవస్తువుల వుత్పత్తికొరకు నిజమైన పాదార్థికపరిస్థితు లేవి? ఈ పాదార్థికపరిస్థితుల వికాససూత్ర మేది? ఈలాంటి అన్ని క్లిష్టప్రశ్నలకును జవాబు చెప్పడంలో మార్క్సు తన శ్రద్ధనంతనూ, శక్తినంతనూ పూర్తిగా వినియోగించేడు. పైకి స్థూల దృష్టికి చరిత్ర యెంత పరస్పరవిరుద్ధంగా కనిపిస్తూన్నా, యెంత అసంబద్ధంగా, విభిన్నత్వంతో కానవస్తూన్నా, అది కొన్ని నియమాలకు బద్ధమై, యేకత్వం గలిగి ధారావాహినిగా సాగు పద్ధతి యని తెలుసుకోడానికై శాస్త్రీయాధ్యయనం గావించే మార్గాన్ని మార్క్సు చూపియున్నాడు.

# వర్గ కలహం.

ఏ నిర్దిష్టసమాజంలోనైనా కొందరి యత్నాలు మరి కొందరి యత్నాలతో తప్పనిసరిగా వైరుధ్యమును కలిగే వుంటాయి. సామాజికజీవిత మనేకస్పర్థలతో నిండియుంది. ప్రజలకూ, సమాజాలకూ మధ్య పరస్పరకలహాలున్నట్లే ప్రతి జాతిలోనూ, ప్రతిసమాజంలోనూ అంతఃకలహాలుకూడా వున్నాయనీ; విప్లవకాలంలోనూ, తిరోగమనకాలంలోనూ, యుద్ధసమయంలోనూ శాంతిసమయంలోనూ, కదలికయే లేని దశలోనూ, విపరీతమైన కదలిక అభివృద్ధి గానీ, పతనం గానీ, వున్న దశలోనూ కూడ యీ కలహ, అంతఃకలహాలు వుంటూనేవుంటాయని చరిత్ర వేనోళ్ళ చాటుతూన్న విషయం అంతా యెరిగిందే. ఇదంతా పెద్దగందరగోళంగా కన్పిస్తూన్నా దీనిలో ఒక నియమం వున్నదని మార్క్సిజం సిద్ధాంతీకరిస్తూంది. ఇదే మార్క్సు బోధించిన వర్గకలహసిద్ధాంతం. ఏదేనా ఒక నిర్దిష్టసమాజంలోని అందరువ్యక్తుల యత్నముల మొత్తాన్ని పరిశీలించుటవల్లనేగాని వీటి పర్యవసానమైన ఫలితాన్ని శాస్త్రీయంగా నిర్దేశించలేము. సమాజంలోని వివిధవర్గాల యొక్క స్థితిగతులు, జీవితపద్ధతులనుబట్టి కలుగుతూన్న భేదాల వల్లనే వారి యత్నాలలోనుండు పరస్పరస్పర్థలు, వైరుధ్యాలు బైలుదేరుతున్నాయి.

“భూతవర్తమానకాలములందలి మానవసమాజంయొక్క చరిత్ర అంతా కూడా (అని 1848లో మార్క్సు కమ్యూనిస్టు మానిఫెస్టోలో వ్రాసేడు;

'ఆదిమసమాజచరిత్ర మినహాగా' అని యేంజిల్స్ దానికి సవరణ చేర్చేడు.) వర్గ కలహాల చరిత్రయే స్వతంత్రుడు- బానిస, సామంతుడు- సామాన్యుడు, ప్రభువు- దాసుడు; శ్రేణియజమాని- కూలివాడు, వేయేల, పీడించేవాడు పీడితుడు,- వీరు పరస్పరం ఢీకొంటూనే వుండేవాళ్ళు. వారి పోరాటం నిరంతరం సాగుతూనేవుండేది. ఒకప్పుడు అంతర్యుద్ధంగానూ' మరొకప్పుడు బహిరంగంగానూ యీ పోరాటాలు సాగుతూండేవి. పోరాటఫలితంగా ఒక్కొక్కప్పుడు సామాజికవ్యవస్థ అంతా పూర్తిగా మారిపోవడం గాని, మరొక్కొక్కప్పుడు పోరాడుతూన్నయిరుకక్షలూ నాశనమవడం గాని విధిగా జరుగుతూండేది ... జమీందారీసమాజ ప్రశిథిలాలనుంచి నేటి పెట్టుబడిదారీ సమాజం బైలుదేరింది. కాని, దీనిలోకూడ వర్గస్పర్ధలు నశింపు కాలేదు. వెనకటి వర్గాలస్థానే నూతనవర్గాలు మాత్రమే బైలుదేరినాయి. కొత్తకొత్త పీడనా విధానాలు వచ్చినాయి; కలహాలు నూతనరూపం దాల్చినాయి. మన శకంలో అంటే పెట్టుబడిదారీశకంలో వర్గస్పర్ధలు విస్పష్టమైనాయి. తేడా యింత మాత్రమే. క్రమక్రమంగా సమాజమంతా రెండేరెండు పెద్దశత్రుశిబిరాలుగా విభజింపబడిపోతూంది. ప్రత్యక్షశత్రుత్వంగల రెండువర్గాలుగా, పెట్టుబడి దారులు శ్రామికులు అను రెండేరెండు వర్గాలుగా విడిపోతూంది.''

ఫ్రెంచిమహావిప్లవకాలాన్నుంచీ చారిత్రక సంఘటనలకు వర్గకలహమే చోదకశక్తి యని విస్పష్టమైంది. యూరోపుచరిత్రే దీనికి తార్కాణ. ఫ్రాన్సులో రాజరికపునరుద్ధరణకాలంలోనే చాలమంది చరిత్రకారులు, సామాన్యదృష్ట్యా సంఘటనల్ని చూసేవారైననూ, ఫ్రాన్సుచరిత్రను సరిగా అర్థంచేసుకోవాలంటే వర్గకలహసిద్ధాంతానికి ప్రాముఖ్యత నీయాలని గుర్తించేరు. ఆధునికయుగంలో, అంటే పెట్టుబడిదారీవర్గం సంపూర్ణ విజయాన్ని పొందిన యీ శకంలో ప్రజాప్రతినిధిసంస్థలు,

విస్తృతమైన వోటింగుహక్కులు (అందరకూ గాకున్నా చాల మందికి వోటుహక్కులున్నాయి), ప్రజాబాహుళ్యంలో విపరీత ప్రచారం గాంచుతూన్న చౌకవార్తాపత్రికలు, దినదినాభివృద్ధి బొందుతూ బలవత్తరాలవుతూన్న కార్మికసంఘాలు, యజమానుల సంస్థలుగల యీ ఆధునికయుగంలో వర్గకలహామే (ఒకొక్కప్పుడు ఒకపక్షము బలవత్తరమవడంచేత పరిస్థితులు 'శాంతియుతం' 'శాసనబద్ధం' గానూ కనిపిస్తూంటాయి.) చారిత్రకసంఘటనల కన్నిటికిని మూలమని మరింత విస్పష్టంగా తెలిసింది.

ఆధునికసమాజంలో వివిధవర్గాల స్థానమున్ను, ఒక్కొక్క వర్గంయొక్క అభివృద్ధిపరిస్థితులున్ను ప్రమాత్మకదృష్ట్యా విశదీకరించి నిర్ణయించడంలో సామాజికశాస్త్రాల కర్తవ్యాన్ని గూర్చి 'కమ్యూనిస్టు మానిఫెస్టో'లో మార్క్సు యీ విధంగా వ్రాసియున్నాడు:

నేడు బూర్జువావర్గాన్ని యెదిరిస్తూన్న వర్గాలన్నిటిలోకీ శ్రామిక వర్గమే నిజంగా విప్లవకారియై యుంది. పరిశ్రమలలో బహుళోత్పత్తివిధానం ప్రవేశించిన తర్వాత యితరవర్గాలన్నీ క్షీణించి నశిస్తాయే కాని శ్రామికవర్గం మాత్రం యీ విధానంవల్ల ఆవిర్భవించి వృద్ధిబొందుతుంది. మధ్యతరగతిలో క్రిందివారైన చిన్నవుత్పత్తిదారులు, చిన్నవర్తకులు, చేతిపనికుశలురు, చిన్న రైతులు, మొదలైనవారంతా మధ్యతరగతిలో తమ స్థానాన్ని నిలబెట్టుకొనే ఆశతోనే బూర్జువావర్గంతో పోరాడుతారు. అందుచేతనే వారంతా వెనుకటి పద్ధతుల్ని నిలవబెట్టాలని కోరేవాళ్ళేగాని విప్లవవాదులు గాజాలరు. అంతే గాదు. వారు అభివృద్ధినిరోధకు లనికూడ చెప్పవచ్చును. ఎందువల్లనంటే

చరిత్రశకటపు చక్రాల్ని వెనక్కి త్రిప్పాలని ప్రయత్నించువాళ్ళు గనక. వారొకప్పుడెప్పుడైనా విప్లవకారులైనారంటే, అది తమ్ము శ్రామికవర్గస్థితిలోనికి పడిపోకుండా రక్షించుకోడానికే గాని వేరుకాదు. ఈ వర్గాలు కాపాడుకొనగోరేది భావిప్రయోజనాలనే గాని తత్కాల ప్రయోజనాల్ని గాదు. అందుచేత వారు శ్రామికవర్గదృక్పథాన్నవలంబించేందుకై తమ వర్గ దృక్పథాన్ని విడిచిపెడుతూన్నా రన్నమాట.''

భౌతికవాదదృష్ట్యా చరిత్రరచనకు వుదాహరణలను చక్కని విషయవంతములైన వాటిని అనేక చరిత్రగ్రంథాల్లోంచి యెత్తి, మార్క్సు చూపించేడు. ప్రతి ప్రత్యేకవర్గంయొక్క, ఒక్కొక్కప్పుడు వర్గంలోని వివిధసమూహాలయొక్క స్థానాల్ని విభజన చేసి వివరిస్తూ, యేయే కారణాలచేత, యే విధంగా 'ప్రతి వర్గపోరాటమూ రాజకీయపోరాటమే అవుతూన్న'దో ఆయన స్పష్టీకరించేడు: పైనుదాహరించిన పేరా చూస్తే, ఒక వర్గానికీ మరోవర్గానికీ మధ్య నున్నట్టిన్నీ, సామాజికసంబంధాల లోని మార్పుల మజిలీల చిక్కుల్నీ, చారిత్రకపరిణామ మంతటి యొక్క పర్యవసానాన్నీ తేల్చుకొనేందుకు మార్క్సు చక్కని మార్గాన్ని చూపించేడు.

మార్క్సు పండితునిఆర్థికసిద్ధాంతం కడుంగడు గంభీరమై, సమగ్రమై, సర్వతోముఖమై, ఆయన యితరబోధనలకు సరిగ్గా అన్వయిస్తూ, వాటిని బలపరుస్తూవుంటుంది.

# మార్క్సు ఆర్థికసిద్ధాంతం

'కాపిటల్' మొదటిసంపుటి పీఠికలో మార్క్సు యిట్లు వ్రాసియున్నాడు: "ఆధునికసమాజపరిణామం (అంటే పెట్టుబడిదారీ సమాజపరిణామం) యొక్క ఆర్థికసూత్రాల్ని స్పష్టీకరించడమే యీ పుస్తకంయొక్క ప్రధానోద్దేశ్యం.' నిర్దిష్టమై, చారిత్రకమైన ఒకసమాజంలోని వుత్పత్తిసంబంధాలు లేక ఆస్తిసంబంధాల ప్రారంభము, అభివృద్ధి, తదుపరి వాటి క్షీణత, వీటినిగూర్చి పరిశీలించుటనే మార్క్సు తన ఆర్థికసిద్ధాంతంలో పొందుపరచియున్నాడు. పెట్టుబడిదారీసమాజంలో 'వర్తకపు సరుకు' యొక్క వుత్పత్తే ప్రధానమైనది. అందుచేత తన ఆర్థికసిద్ధాంత వివరణను 'వర్తకపు సరుకు' యొక్క నిర్దేశవర్ణనతో మార్క్సు ఆరంభించేడు.

## విలువ.

'వర్తకపు సరుకు' (క్రయవిక్రయ మొనర్చు వస్తువు) అనుదానికి మొట్టమొదట మానవుల అవసరాన్ని తీర్చే యోగ్యత వుండాలి. మరో వస్తువుతో మార్చుకోడానికి వీలుగా వుండడమనేది దాని రెండో అర్హత. ఏదైన ఒక వస్తువుయొక్క వుపయోగార్హత, దానికి 'వుపయోగపువిలువ'ను కలుగచేస్తుంది ఒక రకానికి జెందిన, వుపయోగపు విలువ గలిగిన కొన్నివస్తువులు, మరొక రకానికి జెందిన, వుపయోగపు విలువ గలిగిన కొన్ని వస్తువులకు మార్చుకోబడు నప్పుడు, యీ రెండింటి

మధ్యనుగల పరస్పరసంబంధమే వాటికి 'మారకపు విలువ' లేక 'విలువ' ను కలిగిస్తూంటుంది. ఒకదాని నొకటితో పోల్చేందుకు కూడ వీలులేనంతటి విభిన్నత్వం గలిగి వుంటూన్నా కానీ, వేర్వేరు 'వుపయోగపు విలువ' లు కలిగిన వస్తువు లనేకములు సమానములుగా పరిగణింపబడుతూన్నాయని లక్షోపలక్షలుగా నిత్యమూజరుగుతూన్న మారకములే మన అనుభవంలో ఋజువు చేస్తున్నాయి. నిర్దిష్టమైన ఒక సామాజికసంబంధపద్ధతిలో ఒక దానితో మరొకటి సమానంగా చేయబడుతూన్న యీ వేర్వేరు వస్తువుల్లో సామాన్య లక్షణం యేదేనా వుందా? అని మనం పరిశీలించాలి. ఆఁ! వుంది! ఈ వస్తువులన్నీ కూడ 'శ్రమఫలిత తము'లై వుండడమే వాటి సామాన్యలక్షణం. వాటిలో కొంత మానవశ్రమ యిమిడి వుందన్నమాట. వివిధాలైన వస్తువుల్ని మార్చుకోడంలో ప్రజలు పలురకాలకు జెందిన మానవ శ్రమను మార్చుకొంటూన్నారు. వర్తకపు సరుకుల నుత్పత్తి చేయడ మంటే నిర్దిష్టమైన ఒక సామాజిక సంబంధపద్ధతికి దిగడమే. ఈ పద్ధతిలో వివిధవుత్పత్తిదారులు పలురకముల వస్తువుల నుత్పత్తి చేస్తూ (సమాజంలోని శ్రమవిభజన) మార్చుకోడంచేత, యీ వస్తువుల నొకదానితో మరొకదానిని తుల్యంగా చేసుకుంటున్నారు. ఏతావతా తేలిందేమంటే వర్తకపుసరుకు లన్నిటికీ సామాన్యలక్షణం యేదంటే సాధారణ మైన, అనిర్దిష్టమైన మానవశ్రమను కలిగియుండడమే. ఏదోఒక ప్రత్యేకవుత్పత్తిశాఖలోనిదైన నిర్దిష్టమానవశ్రమ, యేదో

ప్రత్యేకతరహా మానవశ్రమ మాత్రమే వర్తకపు సరుకులన్నిటికీ సామాన్యలక్షణం కానేకాదు. అన్ని వర్తకపుసరుకులయొక్క మొత్తం విలువచేత నిరూపించబడేదే ఒక నిర్దిష్టసంఘంయొక్క మొత్తం శ్రమశక్తి అంతాను. అది మొత్తంగా ఒకేఒక రకపు మానవశ్రమశక్తి యైయున్నది. లక్షోపలక్షలుగా నిత్యమూ జరుగుతూన్న సరుకుల మార్పిడే దీనిని ఋజువు చేస్తూంది. ప్రతి నిర్దిష్టమైన 'వర్తకపు సరుకు' లోనూ సామాజికంగా అవసరమైన శ్రమకాలం కొంత వున్నదనే దీని సారాంశం. నిర్ణీతమై, కొంత వుపయోగపువిలువ గలిగిన ఒక వర్తకపు సరుకుయొక్క వుత్పత్తికై సామాజికంగా అవసరమైన శ్రమ లేక శ్రమకాలమును బట్టి ఆ సరుకుయొక్క విలువ నిర్ణయింపబడుతుంది.

"...శ్రమవల్ల నుత్పత్తిజేయబడిన పలురకాల వస్తువుల్ని ఒకదాని కొకటి మార్చుటవల్ల, ఆయా వస్తువుల విలువలను సమానంగా చేస్తూన్నారు; అట్లుచేయడంలో ఆయా వస్తువుల నుత్పత్తిచేయడంలో వినియోగపరచబడిన వివిధములైన మానవ శ్రమలను సమానంగా చేస్తూ, వాటిని ఒకేరకానికి చెంది, సంపూర్ణసామ్యముగల మానవశ్రమగామాత్రమే పరిగణిస్తూన్నారు. తాము ఆపని చేస్తున్నామని యెరుగకనే మానవులు అట్లు చేస్తున్నారు." కాపిటల్ ప్రథమసంపుటం.

'విలువ' అంటే సంఘంలోని యిద్దరు వ్యక్తులమధ్య నుండే సంబంధమని వెనుకటికి అర్థశాస్త్రవేత్త యొకడు చెప్పేడు. 'అదిపదార్థరూపంలో ప్రచ్ఛన్నం గావించబడిన సంబంధ' మని

కూడ అతడు చేర్చియుండాల్సింది! నిర్దిష్టమైన చారిత్రక పద్ధతిగల ఒక సమాజంలోని వుత్పత్తిసంబంధాల క్రమపద్ధతిదృష్ట్యా చూస్తేనే మనకు 'విలువ' అంటే యేమిటో తెలియగలదు. వస్తుమార్పిడిలు కోట్లపర్యాయాలు తిరిగితిరిగి జరుగుతూన్నప్పుడు దరహాంమీద వుత్పత్తిసంబంధాల మొత్తాన్నంతనీ దృష్టిలో వుంచుకుంటేనే యీ 'విలువ'కు అర్థాన్ని తెలుసుకోగలము. 'విలువ' గలవిగా 'వర్తకపు సరుకు' లున్నా యంటే, వాటిలో కొంత పరిమితిగల 'శ్రమకాలం' కరడుగట్టి వుండడంవల్లనే యని మార్క్సు తన 'అర్థశాస్త్రవిమర్శ' అను గ్రంథంలో వ్రాసి యున్నాడు. 'వర్తకపుసరుకు' లలో యిమిడియున్న శ్రమయొక్క ద్వివిధములైన స్వరూపస్వభావాలను విశదాగా వివరించిన తరువాత మార్క్సు 'విలువయొక్క స్వరూపము'ను, 'ధనము యొక్క స్వరూపము'ను వివరించుట కారంభించేడు. తరువాత విలువ ధనరూపంలో యెప్పుడు, యెల్లాగ ప్రారంభమైందో, మారకపుఅభివృద్ధియొక్క చారిత్రకక్రమపద్ధతిని మార్క్సు వివరించియున్నాడు. మొదట యాదృచ్ఛికములు, ఆకస్మికములు తాత్కాలికములు ఐన వస్తువినిమయంలో ప్రారంభమై (ఒక రకం వస్తువులు కొన్ని మరియొకరకం వస్తువులు కొన్నిటికి మార్చబడుతూ, సాధారణమై, అనిత్యమై, తాత్కాలికమైన 'విలువ'ను కలిగించుతూండేవి.) క్రమంగా 'విలువ'కు విశ్వవ్యాప్తమైన రూపం కలిగింది. ఈ దశలోకి వచ్చేటప్పటికి 'ఒకేఒక నిర్దిష్టవర్తకపుసరుకు'కు అన్ని యితరరకాల వర్తకసరకులూ

మార్చబడుతూండేవి. ఈ ఒకేఒక 'నిర్దిష్టవర్తకపుసరుకు' బంగారమే కావడంతో అదే విశ్వవ్యాప్తమైన తుల్యతగలదైంది. అప్పుడే ప్రతి "వర్తకపుసరుకు"కూ 'ధనరూపమైన విలువ'కలగడం సంభవమైంది. (అంటే ప్రపంచంలోని ప్రతిసరుకుకూ బంగారు రూపంలో తుల్యత నేర్పర్చడం సర్వసమ్మతి నొందింది. -అను) వర్తకపుసరకుల వుత్పత్తిమారకముల యొక్క అభివృద్ధిలో కడపటి మజిలీయే "ధనము." 'వ్యక్తిశ్రమ' యొక్క సామాజికస్వభావాన్ని, మార్కెటులోనికి వస్తూన్న వివిధశాఖలకు చెందిన వుత్పత్తిదారులకు గల సామాజిక సంబంధాల్ని మరుగుపరుస్తూన్నది యీ 'ధనమే.' ధనముయొక్క వివిధకార్యాలను మార్క్సు అతివిపులంగా వివరించియున్నాడు. ఇచ్చట మన మొక విషయాన్ని గమనించవలసివుంది. మారకంయొక్కా, మారకపు సరుకుల వుత్పత్తియొక్కా అభివృద్ధిచరిత్రలోని ఘటనల నెన్నిటినో యీ సందర్భంలో మార్క్సు పొందుపరచేడు. దీనినే యేదో ఆచరణసాధ్యంకాని పంథాయనీ, కేవలం వూహ్యాం మాత్రమేయైన వివరణపద్ధతియనీ కొందరు పొరబడుటకూడ జరుగుతూంది.

"ధనమనేది...వర్తకసరకుల మారకం ఒక నిర్దిష్టదశకు వచ్చినపుడే వాడుకలోకి వస్తుంది. ధనంయొక్క వివిధస్వరూపాలు (సమానమైన సాధారణవర్తకసరకులు, లేక తిరుగమార్పుకోడాని కుపయోగించే వస్తువులు, లేక ప్రతిఫలం చెల్లించడాని కుపయోగించేది అంటే సొమ్ము, లేక అంతర్జాతీయ ధనం) దేనిని సూచిస్తూంటాయి? వాటివాటి వినియోగం యెంతెంతవరకు ఆచరణలో పెట్టబడుతూందో, ఒక ధనరూపం మరో దానిమీద యెంత

వరకు, యెల్లాంటి ఆక్రమణను జేస్తూంటుందో దాన్నిబట్టి ఆయా కాలాల్లోని 'సామాజికవుత్పత్తివిధానం' యొక్క వివిధదశలు, ఘట్టాలు సూచించబడుతూ వుంటాయి'' కాపిటల్, మొదటి సంపుటం.

# అదనపు విలువ.

వర్తకసరకుల వుత్పత్తి యభివృద్ధిబొందుతూ ఒక ప్రత్యేక దశకు వచ్చేటప్పటికి 'ధనము'నకు 'పెట్టుబడి' యనే అవతారం వస్తుంది. సరుకులు తిరగమార్చబడు దశలోని మారకపు క్రమము "సరుకు -ధనము- సరుకు" గా వుంటుంది. తాము వుత్పత్తి గావించిన సరుకును ధనమునకు విక్రయించుకుని, ఆ ధనంతో తమ కవసరమైన మరొకసరుకును కొనుక్కుంటారు, మానవులు. కాని పెట్టుబడిదారీపద్ధతిలోకి వచ్చేటప్పటికి యీ క్రమం తలక్రిందై పోతుంది. 'సరుకు- ధనము- సరుకు' అనే దానికి బదులుగా 'ధనము- సరుకు- ధనము' అనేది అమల్లోకి వచ్చేస్తుంది. అంటే ధనంతో యేదో ఒక వర్తకపుసరుకును కొని, దాన్ని తిరిగి అమ్మి కొంత లాభాన్ని సంపాదిస్తుంటారు. ఈ మార్పిడిలో మొదట వాడకంలోకి పెట్టిన ధనంయొక్క అసలు విలువపై హెచ్చుచేయబడిన విలువకే మార్క్సు 'అదనపు విలువ' అని పేరుపెట్టేడు. పెట్టుబడిదారీ సమాజంలో ధనం యీరీతిగా పెరుగుతూండడం విస్పష్టంగా మనకు తెలిసిన విషయమే. ఈ పెంపుచేయు పద్ధతే ధనానికి పెట్టుబడిరూపాన్ని యిస్తూంది. 'పెట్టుబడి' అనేది ఒక ప్రత్యేకమైనట్టిన్నీ చారిత్రకనిర్వచనం

గల్టిన్నీ సామాజికోత్పత్తిసంబంధ మైవుంది. కేవలం సరుకులు మాత్రమే పరస్పరం మార్చుకోనబడుతూ వున్నంతకాలం 'అదనపు విలువ'కు స్థానం లేదు. ఎందువల్లనంటే పరస్పరం సమానములైన 'వర్తకపు సరుకు'లే మార్చుకోబడుతూంటాయి గనక. వర్తకసరకుల మార్పిడిపద్ధతి అమలులో నున్నంతవరకు సరకుల ధరలలో అభివృద్ధివున్నా అదనపువిలువకు స్థానమే ఉండదు. ఎందువల్లనంటే ఆ సమాజంలో కొనేవారియొక్క, అమ్మేవారియొక్క లాభనష్టాలు సరిపోతాయి. ఈ సందర్భంలో మనం ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిందేమంటే ఒక వ్యక్తికిగాని, కొందరు వ్యక్తులకు గాని కలిగే లాభాలాభాల్ని గాక సమూహాం మీద, మొత్తంమీద నిర్దిష్టసమాజ మంతటియొక్క ఫలితాల్నే ఘటనలనే పరిగణిస్తా మనేదే. సరకుల మారకం అదనపు విలువను యెంతమాత్రం సృష్టించ దనినప్పుడు మరెట్లు యిది జరుగుతూంది?

అదనపువిలువను పొందా లంటే 'ధనపుసంచులు ... ఒక ప్రత్యేకసరుకును అన్వేషించాల్సివుంటుంది. ఆ సరకు యొక్క వుపయోగమే విలువను సృష్టించేదిగా వుండాలి. అట్టి ప్రత్యేకగుణం కల సరకును వెతికి పట్టుకోవాలి.' ఆ ప్రత్యేక గుణం వున్నసరుకు వుండనేవుంది. అదే మానవశ్రమశక్తి! దాని వుపయోగమే పనిచేయించుకోడం. పనిచేయించుకోడంవల్ల, అంటే ఆ సరకు నుపయోగించుకోడంవల్ల విలువలు సృష్టించ బడతాయి. ధనస్వామి శ్రమశక్తికి దాని విలువనే చెల్లించి

కొంటాడు. ఏ సరుకు విలువయైనా, దాని వుత్పత్తికై యెంత సామాజికశ్రమకాలం అవసరమవుతూండా అనేదాన్ని బట్టి నిర్ణయించబడుతుందిగదా. అన్ని యితరసరకుల విలువవలెనే శ్రమయొక్క విలువనుకూడ నిర్ణయించ నారంభించేరు. (శ్రమ విలువ అంటే అది చేసే కూలివానియొక్కా అతని కుటుంబం యొక్కా భృతి కగు మొత్తమన్నమాట) ఈ విధంగా ధనస్వామి శ్రమశక్తిని కొనుక్కొని, దాని నుపయోగించే హక్కును పొందుతూన్నాడు. అప్పు డాతడు శ్రమశక్తిచే పని చేయించుట కారంభిస్తాడు. పగలంతా అంటే పంద్రెండుగంటలు పనిచేయించుకొంటున్నాడని యనుకొందాం, వుదాహరణకు. ఆరుగంటలలోనే (అవసరమైన శ్రమకాలం అంటాం దీన్ని) ఆ పనివాడు, తననూ కుటుంబాన్నీ పోషించడాని కయ్యే ఖర్చుకు సరిపడినంతా వుత్పత్తి చేస్తున్నాడను కొంటే, తర్వాత అతడు పనిచేసే ఆరుగంటలలోనూ (అదనపుశ్రమకాలం అంటాం దీన్ని) అదనపు సరకును లేక విలువను తయారుచేస్తున్నాడు. కాని దీనికొరకు పనివానికి ధనస్వామి యేమీ యివ్వడు. అంటే అదనపుశ్రమకాలంలో పనివాడు వుత్పత్తిచేసే అదనపుసరుకుకు అతనికి అదనపువిలువ నియ్యరని అర్థం.

ఉత్పత్తివిధానదృష్ట్యా చూస్తే, పెట్టుబడిలో రెండు విభాగాల్ని గుర్తిస్తాము. మొదటివిభాగం, స్థిరపెట్టుబడి. ఉత్పత్తి పరికరాలైన యంత్రాలు, పనిముట్లు, ముడిసామగ్రిలు మొదలగునవన్నీ యీ శీర్షికక్రిందికి వస్తాయి. ఈ భాగంయొక్క విలువ

అంతా ఒకేమారు గాని, క్రమంగా గాని మార్పు జెందకుండానే, వుత్పత్తియగు పదార్థాలకు జేరిపోతూంటుంది. రెండో విభాగం, అస్థిర పెట్టుబడి. ఇది శ్రమశక్తికొరకై వినియోగించబడుతుంది. ఈ అస్థిర పెట్టుబడియొక్క విలువ స్థిరంగా వుండిపోకండా, శ్రమ వినియోగమవుతూన్నకొద్దీ పెరుగుతూ 'అదనపు విలువ'ను కలిగిస్తూంటుంది. పెట్టుబడి శ్రమశక్తి నెంతవరకు దోచుతూందో తెలుసుకోవాలంటే 'అదనపు విలువను' మొత్తం పెట్టుబడితో పోల్చరాదు. కేవలం అస్థిరపెట్టుబడితో అదనపు విలువను పోల్చి చూస్తేనే యీ విషయం తేలుతుంది. దీనినిబట్టి చూస్తే, పై వుదాహరణలో అధికవిలువప్రమాణం (రేటు అని యీ సంబంధానికి మార్క్సు పేరిడియున్నాడు.) 6: 6; అంటే నూటికి నూరువంతున పెట్టుబడి శ్రమశక్తిని దోచుకుంటూంది.

'సాపేక్షమగు అదనపు విలువ' ను కలిగించడాన్ని గూర్చి వివరిస్తూ శ్రమయొక్క వుత్పత్తిశక్తిని హెచ్చించేందుకై పెట్టుబడిదారీవిధాన మవలంబించిన విధానమందలి మూడు ప్రధానచారిత్రకదశలను పేర్కొనియున్నాడు: 1. సాధారణ సహకారము, 2. శ్రమవిభాగం లేక పరిశ్రమవిభాగం, 3. యంత్రసాధనాలు, బహుళోత్పత్తివిధానం. పెట్టుబడిదారీవిధాన పరిణామంలోని ప్రధానపారిశ్రమికలక్షణాల్ని మార్క్సు చాల గంభీరంగా, సమగ్రంగా విశదీకరించియున్నాడు. రష్యాలోని చేతిపరిశ్రమ ఐన కుస్తర్ పరిశ్రమను గూర్చిన వివరాలు యీ మొదటి రెండుదశలకు చక్కని వుదాహరణలుగానుండి ఆయన

వివరణను ఋజువుగావిస్తూన్నాయి. 1867 లోనే మార్క్సు మహాశయుడు, యంత్రమూలకమైన బహుళోత్పత్తివిధానము గొప్పవిప్లవకరమైన మార్పును దెచ్చునని చెప్పియున్నాడు- పంధొమ్మిదోశతాబ్దపు ఆఖరిభాగంలో యీ విషయమే రష్యా జపాన్ మొదలైన 'నూతన' పెట్టుబడిదారీ దేశాల్లో విస్పష్టంగా ఋజువైంది.

ఇక ముందుకు సాగుదాం. పెట్టుబడి పెరిగి పోగుపడుటనుగూర్చి మార్క్సు వివరణ అత్యంతప్రాముఖ్యతగలదై, అద్వితీయమై వుంది. ధనస్వామి తాను పొందిన అదనపువిలువ నంతనూ స్వోపయోగానికై తన యిచ్ఛవచ్చినట్లు ఖర్చుపెట్టు కొనక, అందులో కొంతభాగాన్ని తిరిగి పెట్టుబడిగా మార్చుతూ యింకనూ అదనపు వుత్పత్తికి యత్నిస్తూంటాడు. ఆడమ్ స్మిత్ మొదలైన పూర్వపు అర్థశాస్త్రజ్ఞులు, అదనపువిలువలోనుండి పెట్టుబడిగా మార్చబడునదంతా 'అస్థిరపెట్టుబడి'కే చేర్చబడుతుందని చెప్పినది పొరబాటని మార్క్సు సూచించియున్నాడు. యదార్థానికి దానిలో కొంత స్థిరపెట్టుబడి (యంత్రాదిపరికరాలు) కొరకున్ను, మిగిలిందే అస్థిరపెట్టుబడి (శ్రమశక్తి) కొరకున్ను వినియోగించబడుతుంది. మొత్తంమీద పెట్టుబడిలో 'స్థిరపెట్టుబడి' అధికతరంగా పెరిగిపోతూ, 'అస్థిరపెట్టుబడి' కంటె అనేకరెట్లు హెచ్చుతుండడం మనం ప్రధానంగా గమనించాలి. పెట్టుబడిదారీవిధానాభివృద్ధిక్రమంలోనూ, అది క్రమాభివృద్ధి జెందుతూ సోషలిజమ్‌గా మారడంలోనూ కూడ యీ 'అదనపు

విలువ' 'స్థిరపెట్టుబడి' లోకి అత్యధికంగా పోగుపడడం అనేది అత్యంతప్రధానపాత్రను ధరిస్తూంది.

పెట్టుబడి క్రమాధికంగా పోగుపడుతూ, యంత్రపరికరాలతో కూలీలను తొలగిస్తూంటుంది. సమాజంలో ఒకవైపు సమృద్ధీ, మరోవైపు దారిద్ర్యం తీవ్రంగా విజృంభిస్తూంటాయి. వినియోగంలేని 'శ్రమ' బైలుచేరడానికీ, పనిపాటులులేని 'నిరుద్యోగులైన' కూలీలపరిమితంగా పెరగడానికీ, జనసంఖ్య విపరీతంగా పెరిగిపోయిందనే పెట్టుబడిదారీ సిద్ధాంతాల ఘోషకునూ కూడ పెట్టుబడి అమితంగా పెరిగి ప్రోగుపడడమేమూలకారణము. ఈ పరిస్థితుల్లో పెట్టుబడిదారీవిధానంవల్ల వుత్పత్తి అతిత్వరగా పెరుగుట కవకాశం కలుగుతుంది. ఉత్పత్తివిధానంలో అభివృద్ధి గలుగుట, పరపతి నిర్మాణం అభివృద్ధిజెందుట, వుత్పత్తిసాధనాల్లో పెట్టుబడి నంతనీ కేంద్రీకరించుట మొదలైనవి పెట్టుబడిదారీదేశాల లక్షణాల్లో కొన్ని. అట్టిదేశాల్లో తరచుగా సంభవించే ఆర్థికసంక్షోభాలు (యివి మొదట ప్రతి పదేళ్ళకూ వస్తూ, తర్వాత యింకా తరుచుగా వచ్చి, యెక్కువకాలం వుంటూంటాయి.) యెందువల్ల వచ్చుచున్నవో, యెట్లు వస్తూవున్నవో విపులంగా తెలుసుకోడానికి పైవిషయాలు సౌలభ్యాన్ని కలిగిస్తాయి. పెట్టుబడిదారీవిధానంక్రింద ధనం పోగుపడడానికీ, 'ప్రాచీనకాలంలో ధనం పోగుపడడానికీ' గల తేడాను మనం గుర్తించాలి. ఉత్పత్తిసాధనాలనుండి బలాత్కారంగా పని

వాళ్ళను వేరు జేయడం, రైతుల్ని భూములనుంచి తరిమి వేయడం, ఉమ్మడిబీళ్ళనూ గోభూముల్నీ దొంగిలించడం, వలస దేశాల్లోని చిన్నరాజ్యాలను ఆక్రమించుకోడం, జాతీయ ఋణాలనీయడం రక్షణసుంకాలు మొదలైనవాటిద్వారానేయీ 'ప్రాచీనకాలంలో ధనం పోగుపడడం' జరిగింది. (యిక్కడ పెట్టుబడిదారీవిధానం వుదయించేవరకూ గల ధనసేకరణా విధానాలన్నీ యివ్వబడినాయి) 'వెనుకటి ధనసంచయనం' ఒక ప్రక్క ధనస్వామిని, పెట్టుబడిదారునీ; మరోప్రక్క 'స్వేచ్ఛ'గల శ్రామికుణ్ణీ సృష్టిస్తుంది.

'పెట్టుబడిదారీవిధానంక్రింద ధనం కేంద్రీకరించబడడానికి గల చారిత్రకప్రవృత్తి'ని గూర్చి మార్క్సు తన సుప్రసిద్ధవచనాల్లో యిట్లు వ్రాసియున్నారు:

"ఉత్పత్తిదారులను దోచుకోడం బందిపోటుగా జరుగుతూంది. నీచమైన స్వార్థపరత్వంతో, తుచ్ఛమైన పిరికితనంతో యీ దోపిడీవిధానం సాగుతూంది. రైతులు, కుశలకార్మికులు స్వకాయకష్టంచే, స్వతంత్రంగా, వ్యక్తిగతంగా కష్టించి సంపాదించుకున్న ప్రత్యేకపుటాస్తులు ఒకవైపు; పెట్టుబడిదారుల ప్రత్యేకపుటాస్తి, అంటే నామకః స్వతంత్రులైన కూలీల రెక్కల కష్టంచే వుత్పత్తి గావించబడిన సరకులను స్వంతం గావించుకుని, వారి శ్రమను దోచుకొంటూన్న పెట్టుబడిదారుయొక్క ప్రత్యేకపుటాస్తులు రెండోప్రక్కను ...ఇప్పుడు సమస్య యేదంటే, తన స్వకాయకష్టంవల్ల జీవనం గడుపుతూన్న శ్రమజీవుల స్వల్ప, ప్రత్యేకపుటాస్తులనా లాగికోవలసింది? లేదా, వేలాది కూలీల రెక్కలకష్టాన్ని దోచుకుంటూన్న పెట్టుబడిదారుయొక్క ప్రత్యేకపుటాస్తులనా లాగుకోవాల్సింది? పెట్టుబడిదారీవుత్పత్తి విధానమందే అంతర్భా

తం గావున్న శాసనాన్ని పూర్తిగా అమలులోకి తీసికొనిరావడంవల్లనే, అంటే పెట్టుబడిని పూర్తిగా కేంద్రీకరింపజేయడంవల్లనే ఆస్తులను లాగివేయడం కార్యక్రమం జరుగుతుంది. ఒక పెట్టుబడిదారుడు తన తోడిపెట్టుబడిదారు లెందరినో నేలమట్టం చేస్తూంటాడు. ఈవిధమైన కేంద్రీకరణంతో అంటే చాలమంది పెట్టుబడిదారులు కొద్దిమందిచేత దోచుకోబడుటతో బాటుగానే, దాని ననుసరించుకొనే కర్మకౌశలంతో సహకారవిధానంకూడా అశేషంగా యభివృద్ధి జెందుతుంది; దీనితోకూడ పనిలో సులువులను కల్పించడానికై భౌతికాదివిజ్ఞానశాస్త్రాల నపజ్ఞాపూర్వకంగా పరిశ్రమల కనువర్తింపజేయడం జరుగుతుంది; భూములు వెనకటివలెగాక నవీనపద్ధతులలో సాగుచేయబడతాయి; శ్రమసాధనాలు క్లిష్టతరములవుతూ సమిష్టిశ్రమవల్లనే వుపయోగించబడడానికి వీలైన స్థితిని పొందుతాయి; ఉత్పత్తిసాధనాలు సామాజిక, సమిష్టిశ్రమైక సాధ్యములవుతూ, అంతకంతకు యెక్కువగా క్లుప్తీకరించబడుతూంటాయి. ప్రపంచప్రజ లందరూ 'ప్రపంచ మార్కెటు' లోనికి యీడ్వబడి తొక్కిడి పడుతూంటారు. అందుచే పెట్టుబడిదారీవిధానము క్రమక్రమంగాఅంతర్జాతీయస్వభావాన్ని పొందు దారిలోకే ఆకర్షితమవుతూంటుంది. పరిణామశీలమైన యీ విధానమందలి సౌకర్యాల నన్నిటినీ ఆక్రమించుకుని, గుత్తాధికారాల్ని పొందే పెద్దపెట్టుబడిదారుల' సంఖ్య క్రమాధికంగా తగ్గుతూంటుంది; కాని యిక్కడ యింకో విశేషంకూడా వుంది: కూలిజనాల సంఖ్య దినదినం హెచ్చుతూ, వారి కోపాగ్ని రాజుతూ, అధికతీక్ష్ణ మవుతూంటుంది; పెట్టుబడిదారీ వుత్పత్తివిధానంలోని యంత్రపరికరాలే కూలీలను సుశిక్షితులుగను, సంఘీభావంగలవారిగను, నియమబద్ధులనుగాను చేస్తూంటాయి పెట్టుబడిదారుల గుత్తపద్ధతిక్రింద,.దానితో బాటుగా అభివృద్ధిబొందినవుత్పత్తి విధానానికి ఆ గుత్తిపద్ధతే సంకెలయైపోతుంది. ఉత్పత్తిపరికరాల కేంద్రీకరణమును, శ్రమయొక్క సామాజికతత్త్వమును క్రమక్రమంగా యభివృద్ధి జెందుతూ, పెట్టుబడిదారీవిధానమునే పై పొరలో యిముడలేని దశకు వస్తాయి. ఈ పొరబ్రద్దలైపోతుంది. పెట్టుబడిదారీ ప్రత్యేకాస్తిపద్ధతియొక్క మరణశాసనం వినబడుతుంది. దోపిడీదారులు దోచుకోబడతారు.' కాపిటల్, ప్రథమసంపుటం.

మొత్తంమీద తీసికొంటే 'సామాజిక పెట్టుబడి' యనేది యెల్లా పునరుత్పన్నమవుతుందో యనే దాన్ని గూర్చినమార్క్సు వివరణ చాలముఖ్యమైనదీ, నవీనమైనదీ ఐవుంది. (కాపిటల్ ద్వితీయసంపుటం.) ఇచ్చటకూడా మార్క్సు ఘటనలను యేకైకంగా కాకుండా మొత్తంగానే తీసికొంటాడు. సమాజపు ఆర్థిక సౌధంలో కేవలం ఒక్కొక్క భాగాన్నే గాక మొత్తం నిర్మాణాన్నంతనూ తీసికొని, విచారణచేస్తాడు. మార్క్సి (ప్రా)మాణిక) అర్థశాస్త్రజ్ఞులలోని పొరబాటును సవరించి, మొత్తం సామాజికోత్పత్తిని మార్క్సు, రెండు విభాగాలు గావించేడు. 1. ఉత్పత్తి సాధనాలనుత్పత్తి జేయుట; 2. నిర్వ్యోప యోగవస్తువులనుత్పత్తిజేయుట.ఉదహరణగా లెక్కల నిస్తూ, మొత్తంసామాజిక పెట్టుబడి యంతా యేవిధంగా తిరుగుతూంటుందో అంటే పూర్వపు అనుపాతంలో పునరుత్పత్తి గావింపబడే దశలోనూ, తర్వాత పెట్టుబడి (పెరిగుపడిన) దశలోనూ సామాజిక పెట్టుబడి యొక్క పరిభ్రమణాన్ని వివరంగా మార్క్సు విశదీకరించి యున్నాడు.

విలువసూత్రాన్ని పునాదిగా తీసికొని, లాభం యొక్క సగటు రేటు యెట్లు నిర్ణయించబడుతూందో యనే సమస్యను కాపిటల్ తృతీయసంపుటంలో పరిష్కరించియున్నాడు. సమాజం యొక్క మొత్తపు టార్థికసంఘటనలనుబట్టే, మొత్తపు టార్థిక

విధానాన్ని బట్టే అర్థశాస్త్రపరిశీలనలను సాగించాలే గాని విడివిడి సంఘటనలను దృష్టిలో నుంచుకొనీ, బాహ్యంగా కనిపించే పోటీ పద్ధతులమీద దృష్టినుంచుకొనీ ముందుకు సాగరాదనేదే మార్క్సు అర్థశాస్త్రానికి చేర్చిన నూతనసిద్ధాంతము. ఆయన, యితర అర్థశాస్త్రవేత్తలవలె సంకుచిత దృష్టితో అసమగ్ర విచారణ చేయలేదు. నేడందరూ వల్లించే 'మార్జినల్ యుటిలిటీ' సిద్ధాంతంవంటి చౌకబారు సూత్రాలను అల్లియుండనూ లేదాయన. అదనపువిలువ యెల్లా ప్రారంభమవుతూందో వివరించి, దాని వివిధరూపములేయైన లాభం, వడ్డీ, శిస్తుయనే వాటిక్రింద విభజించి, మార్క్సు విమర్శగావించియున్నారు.

ఒక వ్యాపారంలో మొత్తంపెట్టుబడికినీ, అదనపువిలువకునూ గల నిష్పత్తే 'లాభ' మని చెప్పవచ్చును. సామాజిక సగటుపరిమాణాన్ని మించివుండేటట్లు అస్థిరపెట్టుబడి నత్యధికంగా మించిన స్థిరపెట్టుబడి వుండటాన్నే అర్థశాస్త్రపరిభాషలో 'తలబరువు' అధికమైన పెట్టుబడి (హై ఆర్గానిక్ కాంపొజిషన్) అంటారు. ఇది లాభం రేటును సగటుకంటెను హీనంగా సమకూరుస్తుంది. అల్లాగాకుండా సామాజికసగటుకు మించినట్లు స్థిర పెట్టుబడికంటె అస్థిరపెట్టుబడి యెక్కువగా వుంటే అంటే 'క్రింది బరువు' హెచ్చుగానున్న పెట్టుబడివుంటే, దానిలో లాభం రేటు సగటుకు మించి వస్తుంది. పోటీలవల్లా, పెట్టుబడిదారులు తమ ద్రవ్యాన్ని ఒక వుత్పత్తిశాఖనుంచి మరోదానికి మారుస్తూండ

డంవల్లా రెండు సందర్భాల్లోనూకూడా లాభపు రేటు తగ్గి పోతుంది. ఏ నిర్దిష్టసమాజంలోనైనా మొత్తం వర్తకపు సరుకుల 'విలువ' అదే సమాజంలోని మొత్తం వర్తకపు సరుకుల 'ఖరీదు'తో సమానంగా వుంటుంది. కాని పోటీకారణంగా ప్రత్యేకవృత్తిశాఖల్లోనూ, ప్రత్యేకవ్యాపారసంస్థల్లోనూ సరుకులు వాటి విలువలనుబట్టి గాక వాటి నుత్పత్తిచేయడానికయే ఖర్చునుబట్టి విక్రయించబడుతూంటాయి. ఇట్టి అమ్మకపుఖరీదు మొత్తం, ఖర్చైనపెట్టుబడికి సామాన్యలాభపు రేటుకలిపితేవచ్చే మొత్తంతో సమానముగావుంటుంది.

విలువకును, ఖరీదుకును గల అంతరమును యీ రీతిగా మార్క్సు చర్చించియున్నాడు. ఈ విషయ మిప్పు డందరూ యెరిగియున్నదీ, అందరూ అంగీకరించేదీ యైయుంది. అన్ని వృత్తిశాఖల్లోనూ లాభాలు సరిసమానమే అవుతూండే ధోరణినిగూర్చి మార్క్సు బాగా బోధనగావించేడు. మార్క్సు తన విలువసూత్రాన్ను సారంగానే యివన్నీ నిర్వచించియున్నాడు. ఎందుచేతనంటే యే సమాజంలోనైనా మొత్తం వస్తువుల విలువ వాటి ఖరీదుతో యేకీభవిస్తుంది. 'విలువ' యనేది సామాజికం; 'ఖరీదు' అనేదివ్యక్తిగతం. ఈ రెండింటి సంబంధమూ, ప్రత్యక్షం, సాధారణం ఐన పద్ధతిలో నడవదు. ఈ సంబంధం యెన్నో చిక్కులతో కూడుకొనివుటుంది. అందుచేత మార్కెట్లోనే సంబంధంపెట్టుకొనే వివిధశాఖల వుత్పత్తిదారులుండేసమాజంలో సూత్రబద్ధమై వుండగలగడం సహజంగా దరిహాంమీద సామాజిక

ఘటనగా మాత్రమే వుంటుంది. కాని దీనిలో వ్యక్తుల్లో, పరస్పర లాభనష్టాలు బేరీజు అవుతూండడం, అక్కడక్కడ యీ సాధారణసూత్రం భంగం అవుతూండడం వుండవచ్చు.

శ్రమయొక్క వుత్పత్తిశక్తి పెరిగిందంటే అస్థిర పెట్టుబడి (కూలి-వేతనాలు)కి అనేకరెట్లుగా స్థిరపెట్టుబడి పెరిగిందన్న మాట. కాని అదనపువిలువ అస్థిర పెట్టుబడి సృష్టించేది గనుక తప్పకుండ సగటు లాభంరేటు తగ్గిపోతుంది. (లాభంరేటు అంటే మొత్తం పెట్టుబడికీ అదనపువిలువకూ వుండే నిష్పత్తియే గాని అస్థిర పెట్టుబడికీ అదనపువిలువకూ గల నిష్పత్తి గాదు.) లాభం రేటు తగ్గుదలయొక్క స్వభావాన్ని గూర్చి వివరిస్తూ, తగ్గుదలకు ప్రోత్సాహకములైనవీ, వ్యతిరేకమైనవీ ఐన పరిస్థితుల్ని మార్క్సు వివరించియున్నాడు.

కాపిటల్ తృతీయసంపుటంలో వడ్డీవ్యాపారుల పెట్టుబడి, వర్తకపు పెట్టుబడి, ధనపు పెట్టుబడి మొదలైన వాటినిగురించి మార్క్సు వివరించిన విషయాలెంతో కౌతూహలకరములు. కాని, వాటి నట్నుంచి అన్నిటికంటే ముఖ్యమైన 'భూమిశిస్తు సిద్ధాంతం' గూర్చి దానిలో వ్రాయబడిన దానిని విచారిద్దాము. భూపరిమితి కొంత హద్దుండడంచేతను, పెట్టుబడిదారీదేశాల్లో భూమంతా ప్రత్యేకవ్యక్తులయధీనంలో వుండడంవల్లను, వ్యావసాయికవస్తువుల ఖరీదులుకూడా వాటివుత్పత్తికయేఖర్చుల్ని బట్టి వుంటాయి. అందులోనూ అధమతరగతి భూమిలో వుత్పత్తి

కయ్యే ఖర్చులు, అధమపరిస్థితుల్లో వస్తువులను రవాణా చేయడానికయ్యే ఖర్చులు, వీటినిబట్టియే యీ ధర నిర్ణయించబడుతుంది. కాని సాధారణపరిస్థితులను బట్టిగాదు. అధమతరగతిభూమిలో వుత్పత్తికయ్యే ఖర్చులకును, వుత్తమతరగతి భూమిలో వుత్పత్తికయ్యే ఖర్చులకును వున్న తేడాయే 'శిస్తు తేడా'కు కారణం. దీన్ని వివరిస్తూ వ్యక్తుల భూముల సారాన్నిబట్టీ, సాగుకుపెట్టే పెట్టుబడినిబట్టీ యీ 'శిస్తు తేడా' లో భేదా లెట్లు కలుగుతవో వివరిస్తూ, మార్క్స్, రికార్డోయొక్క సిద్ధాంతాల్ని ఖండించియున్నాడు. రికార్డో అర్థశాస్త్రజ్ఞుడు, యీ 'శిస్తు తేడా' అనేది భూములు మంచిస్థితిలోనుండి క్రమంగా నిస్సారములైపోవుచుండడంవల్ల కలిగిందంటాడు. దానిని మాత్రమేగాక 'అదనపు విలువ సిద్ధాంతాలు'* అను దానిలో రాడ్‌బర్టస్‌యొక్క సిద్ధాంతాల్నికూడ విమర్శించియున్నాడు, మార్క్స్.

వ్యవసాయపద్ధతుల్లో యభివృద్ధి, కొత్తగా పట్టణాలు బైలుదేరడం; మొదలైన కారణాలవల్ల భూముల స్వభావంలో అభివృద్ధికరమైన మార్పులు కలగడం, భూమి తరహా లేక తరం మారిపోవడం కలుగుతూంటుంది. పెట్టుబడిదారీవిధానంలోనే వున్న వైరుధ్యాలు, సంకుచితత్వం, అసమగ్రత, అసంపూర్ణత మొదలైన వాటినన్నిటినీ ప్రకృతికి ఆపాదిస్తూ, వెనుకటి అర్థ

* ఈ గ్రంథం మూడుసంపుటాలుగా కారల్ కాట్స్కీ సంపాదకత్వాన స్టట్‌గార్ట్ నుంచి 1905లో ప్రచురించబడింది.

శాస్త్రజ్ఞులు 'భూమి క్రమంగా నిస్సారమవుతూ, అల్పాత్యల్ప ప్రతిఫల మిస్తూంటుం' దని సిద్ధాంతీకరించేరు. ఇది పూర్తిగా తప్పని మార్క్సు నిరూపించేరు. అంతగాక పోటీ చేయడానికి సంపూర్ణావకాశాలును, వుత్పత్తియొక్క ఒక శాఖనుంచి మరొక శాఖకు పెట్టుబడిని బదిలీచేసుకొనే వీలును వుంటేనే అన్ని వుత్పత్తిశాఖల్లోనూ లాభంరేటు సమానమవడానికీ, మొత్తంమీద జాతీయార్థికనిర్మాణం బాగుపడడానికీ వీలుంటుంది. కాని, భూమిపై ప్రత్యేకవ్యక్తిహక్కు లుండి, స్వత్వ పద్ధతిచేత పెట్టుబడియొక్క స్వేచ్ఛ నరికడతాయి. వ్యవసాయంలో అస్థిరపెట్టుబడి అత్యధికతరంగా వుంటుంది. భూమి, ప్రత్యేకహక్కులక్రింద వుండిపోవడంచేత లాభంరేటు సమానం చేసుకొనే అవకాశాలుండవు. ఏతావతా హెచ్చులాభాలు పొందడానికి వీలుంది. భూస్వామి ప్రత్యేకహక్కుదారగుటచే తన సరకుల ఖరీదుల్ని యితరసరకుల సగటురేటుకంటె హెచ్చుగా నుంచుకొనగలిగివుంటున్నాడు. భూమియందున్న యీ ప్రత్యేకహక్కువల్లనే 'నికరశిస్తు' పద్ధతి అమలులోనికి వచ్చింది. పెట్టుబడిదారీవిధానం వున్నంతకాలం 'శిస్తుతేడా'ను నశింపుజేయలేము గాని 'నికరశిస్తు'ను మాత్రం తొలగించవీలున్నది. భూమినంతనూ జాతీయం గావించుటద్వారా అంటే భూములను ప్రభుత్వం స్వాధీనం చేసికొనుటవలన దీనిని సాధించ గలము. భూములను జాతీయం గావించడంవల్ల ప్రత్యేకహక్కులు తొలగిపోయి, వ్యవసాయంలోకూడా పెట్టుబడివిధానం పూర్తిగా

ప్రవేశించి, పోటీ నిరాఘాటంగా సాగేందుకు అవకాశంవస్తుంది. అందుచేతనే బూర్జువావర్గంలోని తీవ్రవాదులుకూడా యీ పద్ధతి కావాలని పూర్వకాలాన్నుంచీ ఆందోళన గావిస్తూనేవున్నారని, మార్క్సు సోదాహరణముగా ఋజువుచేసేడు. కానైతే బూర్జువావర్గంలోని అత్యధికసంఖ్యాకులీ పద్ధతికి అంగీకరించరు. ఎందుచేతనంటే, భూమిని జాతీయం చేయడమనేది మొత్తం మీద వుత్పత్తిసాధనాలన్నిటినీ జాతీయం గావించాలనే ఆందోళనకు దారితీస్తుందనే భయంవల్లనే. (1862 ఆగస్టు 2 తేదీని మార్క్సు యేంజిల్సుకు వ్రాసిన జాబులో 'సగటు లాభంరేటు' సిద్ధాంతాన్నిగూర్చీ, 'నికరభూమిశిస్తు' సిద్ధాంతాన్నిగూర్చీ విస్పష్టంగానూ, క్లుప్తంగానూ, సర్వజనామోదకరంగానూ వివరించియున్నాడు. బ్రీఫ్‌వెషెల్ అనే మార్క్సు గ్రంథంలో మూడో సంపుటం, 77–81 పుటలు చూడండి. దానిలోనే 86–87 పుటలలోని జాబు, 1862 ఆగస్టు 9 తేదీ గలదికూడా చూడాలి.)

భూమిశిస్తుచరిత్రను వివరిస్తూ మార్క్సు యిట్లా వ్రాసియున్నాడు: మొదట్లో రైతులు వనిరూపంగా శిస్తు చెల్లించేవారు. (అంటే ప్రభుని భూమిలోనే పని చేసిపెట్టి, తను దున్నుకొనే భూమికైన శిస్తుక్రింద అదనపువిలువ నిచ్చేవారు.) ఈ పద్ధతే తరువాత మార్పులు జెంది, సరుకురూపంగా శిస్తు యివ్వడం క్రిందికి వచ్చింది. (అంటే రైతు, తాను దున్నుకొనే భూమిలోనే అదనపువిలువను వుత్పత్తిచేసి, తన అవసరాలు తీరకపోయినా సరే, గత్యంతరంలేక దానిని ప్రభుని కిచ్చేవాడు.) క్రమంగా

వస్తూత్పత్తివిధానంలో యభివృద్ధికలగడంవల్ల శిస్తుకూడా ధన రూపం దాల్చింది. (అంటే అదివరలో వస్తురూపంలో యిస్తూ వచ్చిన శిస్తుకు యిది సరిపడివుంటుంది. దీనినే రష్యాలో ఓబ్రోక్ అంటారు.) ఆఖరికిది కాపిటలిస్టుశిస్తుగా మారింది. స్వంతసేద్యం చేసే రైతుల అధీనంలోనుంచి భూమిని తప్పించి, కూలీలచే సేద్యంచేయించు 'వ్యావసాయికవ్యాపారులు' బైలుదేరడంతోనే కాపిటలిస్టుశిస్తు అమల్లోకి వచ్చింది. 'కాపిటలిస్టు భూమిశిస్తు' యొక్క ప్రారంభాన్ని గూర్చి తెలుసుకొనేటపుడు 'వ్యవసాయంలో పెట్టుబడిదారీవిధానంయొక్క పరిణామా'న్ని గూర్చి మార్క్సు వ్రాసిన గంభీరభావాలను గుర్తించడం ముఖ్యం. (వెనకబడియున్న రష్యా మొదలైన దేశాలపట్ల యీ విషయాలు మరింత గమనార్హములు)

"ఆస్తిలేనట్టిన్నీ, కూలికి బోయితేగాని జీవితాన్ని గడుపలేనట్టిన్నీ వర్గమొకటి బైలుదేరి, తమ్ము తామే దినభత్యానికై విక్రయించుకోడం వచ్చేక తత్ఫలితంగా తప్పనిసరిగా వస్తురూపమైన శిస్తు ధనరూపమైన శిస్తుగా మారడం తటస్థించింది. ఈ రోజుకూలీవర్గం ఆ తర్వాతకూడా వుంటూనే వుంది. వెనుకటి జమీందారీలగోజుల్లో కొంచెం అధికధనంగల దాసులు సామాన్యదాసుల నెట్లు తమ స్వలాభానికై వినియోగించుకొనేవారో అట్లే ఈ నూతనకూలీవర్గం అక్కడక్కడ బైలుదేరినరోజుల్లో, కొంచెం మంచి స్థితిలో నుండే రైతులు, తాము ప్రభువర్గానికి కప్పంకడుతూన్నవాళ్ళే, తమ స్వలాభానికై యీ దినకూలీవర్గాన్ని దోచుకోడం సాగిస్తారు. ఈ విధంగా క్రమక్రమంగా యీ రైతులు అభివృద్ధిజెందుతూ, ధనవంతులవుతూ, ముందు ముందు కాబోయే పెట్టుబడిదార్లగుటకు 'తగ్గశక్తినికూడా' సంపాదించు

కుంటూంటారు. వెనుక తామేమైయె స్వంతంగా సేద్యం చేసికొంటూ జీవయాత్ర గడిపే రైతువర్గంలోనుంచి కాపిటలిస్టు భూస్వాములు తప్పనిసరిగా బైలుదేరు తారు. అంటే పట్టణప్రాంతాల్లోని వస్తూత్పత్తియంతా పెట్టుబడిదారీపద్ధతు ల్లోకి వస్తూన్నకొద్దీ పల్లెటిప్రాంతాల్లో యీ వ్యావసాయికపెట్టుబడిదారులు బైలుదేరడం తప్పనిసరిగా వస్తుంది.'' కాపిటల్, మూడోసంపుటం.

''పల్లెటిప్రజల్లో కొందరి నీవిధంగా దోచుకుని, వారిని భూములనుండి తరిమివేయడంవల్ల వారంతా తమతమ శ్రమసాధనాలతోసహా బోయి పారి శ్రామిక కూలీలుగా చేరుతూంటారు. అంతేగాక తిండిలేని వీరందరూ చేరి, వస్తువులను కొనువారుగావుంటూ, దేశీయమార్కెటుగా, వస్తుగ్రాహకులుగా వుపయోగ పడతారుకూడాను.'' కాపిటల్, మొదటిసంపుటం.

వ్యావసాయికప్రజల్లో వ్యాపించిన యీ బీదతనమూ, వినాశనమూ, వారిని నిరాధారులుగా చేసివేసి, పెట్టుబడిదారీ సంస్థలో వినియోగపడే మూలబలంగా అంటే కూలీవర్గంగా తయారుచేస్తుంది. ప్రతిపెట్టుబడిదారీదేశంలోనూ,-

"...గ్రామజనుల్లో కొందరు ప్రతియేటా పట్టణాలికి బోతూ, అచ్చటి శ్రామికవర్గంలో అనగా వస్తూత్పత్తి గావించే శ్రామికజీవుల్లో చేరిపోతూంటారు. (వ్యవసాయేతరవృత్తులన్ని టిలోనూ అనే యిక్కడ అర్థం.) ఈ రీతిగా, అక్కర కెక్కువగా వున్నట్లు గాన్పించే యీ జనులంతా పట్టణాలకు ఒకే ప్రవాహంగా పోతూంటారు ... అందుచేత వ్యవసాయికకూలీల వేతనాలు సాధ్యమైనంత తక్కువలోనే వుంచబడుతూ, వారి నెప్పుడునూ దుర్భరదారిద్ర్యంలోనే వుంచుతూంటాయి." కాపిటల్, మొదటిసంపుటం.

భూములు రైతుల స్వంతఆస్తిగా నుండడంవల్ల వ్యవసాయంలో అల్పోత్పత్తివిధానమే ప్రబలియుంటూ, విజృంభిస్తూ, పురాతన పద్ధతిలోనే వుండిపోతుంది, వ్యవసాయం. కాని, యిట్టి అల్పోత్పత్తి కేవలం పురాతనకాలపు సంకుచితోత్పత్తి విధానానికే, పురాతనసంకుచితసమాజానికే సరిపడుతుంది. పెట్టుబడిదారీవిధానంలో 'పారిశ్రామికకూలీల' వలెనే వ్యావసాయికులును దోచబడుతూంటారు. "కేవలం ఆ దోపిడీ రూపంలో మాత్రమే మార్పుంటుంది. ఈ రెండుచోట్లాకూడా దోపిడీ చేసేది ఒకటే, పెట్టుబడి. పెట్టుబడిదారీవ్యక్తులు ఋణాలతోను, తనఖాలతోను, దారుణవడ్డీలతోను వ్యక్తిగతంగా రైతుల్ని దోచుకుంటూంటారు. పెట్టుబడిదారీవర్గం మొత్తంగా రైతువర్గాన్ని ప్రభుత్వపన్నులవిధానంద్వారా దోచుతూంటుంది." (ఫ్రాన్సులో వర్గకలహాలు అనే గ్రంథంలో మార్క్సు.) "రైతువారీ సేద్యం, అంటే కొద్దికొద్దిగా భూముల్ని కలిగియుంటే సేద్యపద్ధతివల్ల పెట్టుబడిదారుకు లాభం, వడ్డీ, శిస్తులను భూముల నుంచే పిండడానికి వీలైన స్థితిలోనికీ స్వంత ఆస్తిగల రైతు తన కూలిని తానే యిచ్చుకునే స్థితిలోనికీ గెంటబడుతూన్నారు.'' విధిగా రైతు తన స్వకాయకష్టార్జితంలో కొంతభాగాన్ని పెట్టుబడిదారీసమాజానికి అంటే పెట్టుబడిదారీవర్గానికి ధారపోస్తూనే వున్నాడు. క్రమంగా రైతులందరూ ఐర్లాండు రైతుల స్థితిలోనికి దిగజారుతూనేవున్నారు. ఇదంతాకూడా కేవలం ప్రత్యేకపుటాస్తిని కలిగియున్నారని చెప్తూనే!

"వ్యవసాయంకూడా పెట్టుబడిదారీపద్ధతులపై నడుపబడే దేశాల్లోకంటె చిన్నచిన్న రైతులుండే దేశాల్లో ధాన్యాల ధరలు తక్కువగా వుంటాయి." ఇది యెందువల్ల? (కాపిటల్, మూడోసంపుటం) రైతు, తాను పండించినదానిలో అదనంగా మిగిలేదానిలోంచి కొంతభాగాన్ని సమాజానికి (అంటే పెట్టుబడిదారీవర్గానికి) బహుమానంగా ఉచితంగా యిచ్చి వేస్తున్నాడు గనుకనే. "ఆహారదినుసులయొక్కా, యితరవ్యావసాయిక వస్తువుల యొక్కా తక్కువధరలు, రైతుల శ్రమయొక్క వుత్పాదకశక్తి హెచ్చడంచేత గాక కేవలం వారి దారిద్ర్యంవల్లనే నని మనం తెలుసుకుంటాం." కాపిటల్, మూడోసంపుటం. అల్పోత్పత్తికి రూపాంతరమైన రైతుల స్వంతవ్యవసాయవిధానం, అంటే చిన్నభూఖండాల్ని సాగుచేసే పద్ధతి, పెట్టుబడిదారీవిధానంక్రింద క్రమంగా క్షీణించి, రాలి, నశించిపోతుంది. ఇది తప్పదు.

"చిన్నచిన్న రైతువారీ స్వంతఆస్తివిధానము స్వాభావికంగానే శ్రమయొక్కా, సమాజంయొక్కా వుత్పత్తిశక్తినీ, శ్రమయొక్క సామాజిక స్వరూపాలనూ, పెట్టుబడి సామాజికంగా కేంద్రీకరించబడడాన్ని, విరివిగా పశుపాలనాదికార్యాల్ని సాగించడాన్ని, వుత్పత్తివిధానానికి శాస్త్రీయ పద్ధతుల్ని జతపరచి, యభివృద్ధిచేయడాన్ని ఆటంకపరిచేదిగానే వుంటుంది. అధికవడ్డీలు, పన్నుల విధానం, యీ చిన్నచిన్న ఆస్తులను పీల్చిపిప్పిచేస్తూనే వుంటాయి. పెట్టుబడిలో చాలభాగం భూముల ఖరీదుక్రిందనే వినియోగపరచవలసివుంటుంది గనుక యీ మొత్తములన్నీ వ్యవసాయంకొరకై వినియోగపరచే వీలులేకుండాపోతుంది. ఉత్పత్తిసాధనాలన్నీ బాగా క్షీణిస్తాయి. ఉత్పత్తిదారులలో అసహకారము హెచ్చుపెరిగిపోతుంది. (సహకారసంఘాలు

అంటే చిన్నరైతుల సమిష్టియత్నాలు అపురూపంగానే పెట్టుబడిదారీ పంథాలో కొంత అభివృద్ధికరపాత్రను ధరించి, చిన్నరైతుల్లోని అసహకార విధానాన్ని కొంచెం మాటుపెడుతుందే గాని దానిని తొలగించదు. అదీగాక యీ సహకారసంఘాలు కొంచెంబాగావున్న రైతులకే సాయంచేస్తాయి గాని సామాన్యప్రజానీకాని కెంతమాత్రమూ వుపకరించవు. పైపెచ్చు యీ సహకారసంఘాలుకూడా కార్మికుల్ని, శ్రమను దోచుకో నారంభిస్తుంది.) ఈ చిన్నకమతాల సేద్యవిధానం మానవశ్రమశక్తి నెంతో వృధాచేసివేస్తూ వుంటుంది. ఉత్పత్తి కనుకూలమైన పరిస్థితుల్ని క్షీణింపజేస్తూ, ఉత్పత్తిపరికరాల ధరల్ని పెంచుతూండడమే యీ విధానానికి ఫలితము.'' కాపిటల్ మూడో సంపుటం.

పెట్టుబడిదారీవిధానం పరిశ్రమల్లోనూ, వ్యవసాయంలోనూకూడా వుత్పత్తిపద్ధతుల నెంతో యభివృద్ధిపరుస్తుంది. కాని ఆ అభివృద్ధి వుత్పత్తికారకులైనవారిని నాశనం చేసేదిగానే వుంటుంది.

''పల్లెటిప్రాంతాల్లో వ్యావసాయికకూలీలు సువిశాలప్రదేశాల్లో వెదజల్లబడిపోయివుంటారు. అందుచే వారిలోనున్న ప్రతిఘటనాశక్తి (యెదురొడ్డే శక్తి) తగ్గిపోయివుంటుంది. కాని అదేసమయంలో నగరాల్లోని పారిశ్రామిక కార్మికుల్లో యీప్రతి ఘటనాశక్తి క్రమాభివృద్ధిజెందుతూంటుంది. ఆధునికవ్యవసాయంలోనూ, నగరపరిశ్రమల్లోనూకూడా శ్రమ (శ్రామికుల) యొక్క వుత్పత్తిశక్తీ, శ్రమయొక్క చలనశక్తీ బాగా హెచ్చించబడినాయి. ఐతే, శ్రమశక్తిని వినాశం గావించీ, కార్మికుల్ని ఆధివ్యాధుల పాల్జేసియునే వీటిని సాధించగలుగుతున్నారు. అంతేగాక పెట్టుబడిదారీవ్యవసాయపద్ధతిలోని ప్రతి యభివృద్ధికూడా వ్యవసాయకూలీలనూ, భూమినీకూడా అధికాధికంగా దోపిడీచేసే కళయే. ఈదోపిడీకళయే అభివృద్ధిగావించబడుతూందన్న మాట...అందుచేత పెట్టుబడిదారీ వుత్పత్తివిధానం కేవలం పరికరములను,

శాస్త్రీయకౌశల్యాన్నీ, సామాజికోత్పత్తివిధానంలోని సహకారాన్నీ మాత్రమే వృద్ధిబొందించగలదు. కాని. అదేసమయంలో సమస్తసంపదల వుత్పత్తికీ పునాదులైన భూమినీ, శ్రమజీవులనూ క్షీణింపజేస్తుంది, నాశనం చేస్తుంది.'' కాపిటల్, ఒకటోసంపుటం.

## సోషలిజం

నేటి సమాజపు ఆర్థికనియమపరిణామగతిని బట్టి పైన వివరించిన దానినిచూస్తే, పెట్టుబడిదారీసమాజం సోషలిస్టు సమాజంగా మారకతీరదని మార్క్సు మహాశయుడు సిద్ధాంతీకరించినది స్పష్టమవుతూంది. శ్రమ, దానియొక్క అసంఖ్యాకమైన అన్నిరూపాల్లోనూ సామాజిక మొనర్పబడడమే సోషలిజం తప్పకవస్తుం దనడానికి కారణం. శ్రమ సామాజిక మొనర్పబడుట నానాటికి వృద్ధిజెందుతూ, మార్క్సు చనిపోయిన తర్వాత గడచిన యాభైయేళ్ళలోనూ పూర్తిగా ఋజువైంది. బహుళోత్పత్తివిధానం వృద్ధిబొందడంలో, కాపిటలిస్టు కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు విరివిగా బైలుదేరడంలో యీ మార్పు, అభివృద్ధి స్పష్టంగా ఋజువవుతూనేవుంది. ఈ సంస్థలవల్లనే గాక ఆర్థికపెట్టుబడియొక్క శక్తి, వ్యాపకతలు అధికంగా వృద్ధిబొందడంలోకూడా యిది ఋజువైవుంది. ఈ నూతనపరిణామాన్ని గొనిరాగల నైతికబలం, మేధాబలం, శ్రామికవర్గానికే వుంటాయి. కాపిటలిజమే యిది నెరవేర్చేటందుకు కావాల్సిన భౌతికబలాల్ని తరిఫీదుచేస్తుంది. బూర్జువా శ్రామికవర్గాల

పోరాటం అనేకరూపాలు దాలుస్తూ, క్రమంగా తీవ్రతరమవుతూ, రాజకీయపోరాటంగా తప్పక మారుతుంది. ఈ పోరాటానికి గమ్యస్థానం రాజకీయాధికారాన్ని హస్తగతం చేసికోవడమే పెట్టుబడిదారీవిధానంక్రింద వుత్పత్తివిధానమంతా సామాజిక మొనర్చబడుతూంది. ఈ పరిణామమే కడకు, వుత్పత్తిసాధనాల నన్నిటినీకూడ సమాజపరం చేయడానికి తోడ్పడుతుంది. అంటే ప్రస్తుతం దోపిడీదార్లుగా నున్నవారందరూ దోచుకోబడతా రన్నమాట. ఈ నూతనమైన మార్పుకు ప్రత్యక్షఫలితాలుగా అనేక రంగాల్లో అభివృద్ధికలుగుతుంది; శ్రమయొక్క వుత్పాదకశక్తి బ్రహ్మాండంగా పెరుగుతుంది; అందరికీ శ్రమచేయవలసిన గంటలు తగ్గించబడతాయి; యిప్పుడింకా పురాతనపద్ధతుల మీద, వ్యక్తులచే, సంకుచితంగా జరుపబడుతూన్న వుత్పత్తిశాఖలను సమిష్టికృషిగావించేవారూ, కర్మకుశలురూనైన శిక్షిత కార్మికుల చేతుల్లోకి మారుస్తాము, యిటువంటి ప్రత్యక్షఫలితాలు యింకెన్నో కలుగుతాయి.

వ్యవసాయానికీ, పరిశ్రమలకీ గల సంబంధాల్ని పెట్టుబడిదారీవిధానం తొలగిస్తుంది. కాని, పెట్టుబడిదారీవిధానం అతిఉచ్ఛస్థితికి బోయినపుడు, అదే నూతనంగా యీ రెండింటికినీ సంబంధాలు కల్పించేందుకు యేర్పాట్లు చేస్తుంది. ప్రజలను గ్రామాల్లో తిరిగి సర్దుతూ, సమిష్టికార్య నిర్వహణను కలుపుకొనివస్తూ, చైతన్యంతో శాస్త్రీయవిజ్ఞానమును వ్యవసాయంలో వుపయోగిస్తూ, యిట్టి విధానాల ద్వారానే పరిశ్రమలకు, వ్యవసాయానికీ సామరస్యం కుదుర

స్తుంది. (అంతేగాకండా, సాధారణంగా పల్లెటూళ్ళలో ప్రబలి వుండే అనాగరికతను, యేకాకిత్వాన్నీ తుదముట్టిస్తుంది; పెద్ద పెద్ద నగరాల్లోవిస్తారంగా ప్రజానీకం అస్వాభావికంగా పోగు బడడాన్నికూడ ఆటంకపరుస్తుంది.) కుటుంబజీవితములో నూతనవిధానములు, స్త్రీల స్థితిగతుల్లో మార్పులు, భవిష్యత్పౌరులైన బిడ్డల్ని పెంచడంలో నవ్యరీతులు, ఇంకెన్నో అభివృద్ధికరములైన మార్పులుకూడా ఆధునిక పెట్టుబడిదారీవిధానం ఉన్నతస్థాయిలోనికి వచ్చేటప్పటికి అవాఉలలోకి వస్తాయి. అదే సమయంలో స్త్రీలు, పిల్లలచేతను కూలిచేయించుకోడమూ, పెట్టుబడివిధానంచేత పురాతనపైతృకకుటుంబపద్ధతి విచ్ఛిన్నమవడమూ మొదలైనవి ఆధునికసమాజంలో అతిభయంకరమును, అసహ్యకరమును, వినాశాత్మకమున్నూ ఐన రూపాలు దాలుస్తాయి ఏదెట్లున్నా,—

"......బహుళోత్పత్తివిధానం వచ్చి స్త్రీలను, పిల్లలనూకూడా యీ వుత్పత్తివిధానంలోనికి లాగుకొనివస్తూ, వారికికూడ వుత్పత్తివిధానంలో తగు ప్రాముఖ్యత నిస్తుంది. వారు గావించాల్సిన యీ విధులు, పనులు అన్నీ గృహానికి బైటనే నిర్వర్తించాల్సివుంటుంది. ఈ విధానంవల్ల స్త్రీపురుష సంబంధాలలోనూ, కుటుంబపద్ధతిలోనూ అభివృద్ధికరమైన గొప్పమార్పును తెచ్చిపెట్టి, దానికి తగిన ఆర్థికపునాదిని వేసింది. క్రిష్టియను, ట్యుటానిక్ కుటుంబపద్ధతే లోపరహితమనీ, ఆదర్శప్రాయమనీ, శాశ్వతమనీ, కడపటిదనీ తలుచటకంటె బుద్ధిహీనత వేరేలేదు. అల్లాగే పూర్వగ్రీషియన్, రోమన్, ఆర్యన్ సనాతనకుటుంబపద్ధతులే కడపటివనీ నిర్ణయింప వీలులేదు. ఇవన్నీ కేవలం, చారిత్రకంగా సంబంధం గలిగినవట్టిన్నీ, క్రమపరిణామాభివృద్ధిని

సూచించునట్టిన్నీ కుటుంబవిధానాలు. అంతేగాక స్త్రీపురుషు లిరువురిలో నుంచీ, వివిధవయస్కులైనవారి నొకచోట చేర్చి, కూలిపనిలో వినియోగించడం చాలఅభివృద్ధి జెందినా, అనాగరకమూ క్రూరమూనైన పెట్టుబడిదారీ విధానంలోనే తనంతగా బైలుదేరిన దగుటచేత అసౌకర్యయుతమే అవుతూంది. (ఎందువల్లనంటే పెట్టుబడిదారీవిధానంలో శ్రామికుడు వుత్పత్తి క్రమంకోసం వుపయోగించబడతాడే గాని వుత్పత్తిపద్ధతి పనివానికొరకే యనే ప్రధానవిషయం గుర్తించబడదు.) అంతేగాక యీ విధానమే శ్రామికులలో అవినీతి, బానిసత్వము ప్రబలడానికిన్నీ, వారి వినాశనానికిన్నీ కారణమవుతూంది. కాని పరిస్థితులు మారించో యిదే మానవాభ్యుదయానికీ, అభివృద్ధికీ పునాదిగా యేర్పడి తోడ్పడగలదు.'' కాపిటల్, మొదటిసంపుటం.

ఫాక్టరీపద్ధతిలో ''భవిష్యద్విజ్ఞానబీజాలు కనిపిస్తానే వున్నాయి... ఈ విజ్ఞాన మెల్లాంటి దంటే కొంతవయస్సు దాటిన ప్రతిశిశువుకూ వ్యాయామం, విద్యాబోధనతో బాటుగా 'వుత్పాదకశ్రమ' చేయడంకూడా నేర్పబడుతుంది. ఇల్లా చేయడంవల్ల సామాజికోత్పత్తి హెచ్చడమేగాక సర్వావయవసంపూర్ణులూ, బలిష్టులూనైన మానవవ్యక్తులు తయారు కాగలరు.'' అని కాపిటల్, మొదటిసంపుటంలోనే మార్క్సు వ్రాసియున్నారు. మార్క్సు బోధించిన సోషలిస్టుసిద్ధాంతాలు బలమైన చారిత్రికపునాది గలిగి,- జాతీయత, రాజ్యాంగం మొదలైనవానిని గూర్చిన సమస్యలను కూలంకషంగా చర్చించునట్టివి. అవి కేవలం వెనుకటివృత్తాంతాల్ని తెలపడానికి చెప్పే కథలవలె గాకుండా, గత అనుభవాల్ని తెలుపుతూ,

భవిష్యత్తునుగూర్చిన నిర్ణయాలను అనుభవపూర్వకంగా తెలివి తేటలతో గావిస్తూ, వాటిని పొందగలగడానికి ధైర్యంగా కార్యాచరణకు దారితీసేవిగా, ఆచరణయోగ్యమైనవిగా వున్నాయి. సామాజికాభివృద్ధియొక్క బూర్జువాశకంలో 'జాతి' అనేది పరిస్థితుల కత్యవసరఫలితమున్ను, తప్పనిసరియైన రూపమునూ ఐవుంది. 'జాతీయం కానిదే,తన నొకజాతిగా నిర్ణయించుకొననిదే' శ్రామికవర్గం బలీయం కానేరదు, వికసించలేదు, తన శక్తులన్నింటినీ కూడదీసుకోలేదు. (కాని, యిక్కడ 'జాతీయత' బూర్జువా అర్థంలో మాత్రంకాదు.) ఐతే, పెట్టుబడిదారీవిధానం వృద్ధిబొంది, ఒకజాతికీ మరొకజాతికీ మధ్య నుండే అడ్డంకుల్ని తొలగించి, జాతులు ఒంటెత్తుగావుండడాన్ని రూపుమాపి, జాతీయవైరుధ్యాల స్థానే వర్గవైరుధ్యాల్ని స్థాపిస్తుంది. అందుచేతనే పెట్టుబడిదారీవిధానం బాగా అభివృద్ధి జెందిన దేశాల్లో 'శ్రామికులకు మాతృదేశ మనేది లే' దనేది అక్షరాలా నిజం. అంతేగాకుండా 'అధమపక్షం నాగరిక దేశాల్లోనైనా కార్మికుల ఐకమత్యమే వారు దౌర్భాగ్యస్థితినుంచి విముక్తి జెందడానికి ముఖ్యమైన' దని మార్క్స కమ్యూనిస్టు మానిఫెస్టోలో చెప్పియున్నాడు. 'రాజ్యాంగ యంత్ర' మంటే ప్రజానీకాల నణిచిపెట్టి యుంచడానికై యేర్పాటుచేసిన ఒక కట్టుదిట్టము. అది యేయే పరిస్థితుల్లో యెప్పుడు అమల్లోకి వచ్చింది? మానవసమాజం క్రమాభివృద్ధి జెందుతూ, సామరస్యం కుదరజాలని వివిధవర్గాలుగా చీలిన

పరిస్థితుల్లోనే 'రాజ్యాంగయంత్రం' అనేది విధిగా పుట్టివుంది. ఆ పరిస్థితుల్లో 'ఆజ్ఞాశక్తి' (ప్రభుశక్తి) లేనిదే సమాజం నడవదు. అందుచేత మొట్టమొదట్లో సమాజంకంటె భిన్నమైనదై, సమాజంకంటె వున్నతపదంలో నున్నదిగా భావించబడిన శక్తియే 'రాజ్యాంగయంత్రం'మైంది. ఈ విధంగా వివిధ వర్గాల స్పర్థలవల్ల పుట్టినదై, రాజ్యాంగయంత్రం,-

"......మిక్కిలి బలవంతమై, ఆర్థికాధిక్యతగల వర్గంయొక్క 'రాజ్యాంగయంత్ర'మై పోతుంది. ఎందుచేతనంటే ఆర్థికబలాన్ని పురస్కరించుకొన్న వర్గమే రాజకీయబలాన్ని చేజిక్కించుకొంటుంది. ఈ విధంగా రాజ్యాంగయంత్రం ఆర్థికాధిక్యతగల వర్గంయొక్క వశమైనప్పుడే ఆ వర్గం, అణిచిపెట్టబడుతూన్న సామాన్యప్రజల్ని యింకా యెక్కువగా అణచివేయడానికీ, దోచుకోడానికీ ప్రారంభిస్తుంది. పూర్వకాలంలో బానిసల యజమానులు తమక్రింది బానిసల నణచియుంచడానికై ప్రభుత్వాన్ని చేజిక్కించుకొని నడిపేవాళ్ళు, అప్పట్లో వారిదే ప్రభుత. ఆ తరువాత జమీందారీ ప్రభుత్వం అమల్లోకివచ్చింది. తమపై నాధారపడివున్న రైతుల్నీ, దాసుల్నీ అణిచియుంచడానికై ప్రభువర్గాలు 'జమీందారీ రాజ్యాంగయంత్రా'న్ని చెలాయించేవారు. ఆధునికప్రజాప్రాతినిధ్యప్రభుత్వం, కూలిపనివాళ్ళను దోచుకొనే కాపిటలిస్టు దోపిడీగాండ్ర ప్రభుత్వమని చెప్పాలి." కుటుంబం, ప్రత్యేకాస్తి, రాజ్యాంగయంత్రం, వీటిమూలం- అనే గ్రంథంలో యేంజిల్స తనయొక్క, మార్క్సుయొక్క అభిప్రాయాల్ని వెలిబుచ్చేడు.)

పెట్టుబడిదారీప్రభుత్వవిధానాల్లోకల్లా యభివృద్ధికరమైనదీ, స్వేచ్ఛాయుతమైనదీనైన ప్రజాస్వామ్యరాజ్యాంగంలో కూడా యిట్టి పరిస్థితులే వుండకతీరదు. కేవలం రూపంలో మాత్రమే మార్పుంటుంది. ఈ ప్రభుత్వం స్టాక్ఎక్స్చేంజి

తోనూ, ఉద్యోగవర్గంతోనూ సమీపసంబంధాల నేర్పరుచు కుంటుంది. పత్రికలు మొదలైనవాటిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అవినీతికరపద్ధతుల్లోకి లాగుతుంది. వర్గములను నిర్మూలించడంద్వారానే సోషలిజం యిట్టి రాజ్యాంగయంత్రాన్ని తొలగించుతుంది.

"సమాజం మొత్త మందరియొక్క లాభంకోసం, వుత్పత్తిసాధనాల్ని వ్యక్తులనుంచి లాగివేయడమే సమాజప్రతినిధ యని చెప్పదగిన 'రాజ్యాంగ యంత్రం' చేయదగ్గ ప్రథమకర్తవ్యం. 'రాజ్యాంగయంత్రం'గా వుండి స్వతంత్రంగా చేసే ఆఖరిపనీ అదే. అప్పుడింక సామాజికసంబంధాల్లో రాజ్యాంగాధికారం జోక్యం కలగజేసికోడం అనవసర మవుతుంది. క్రమంగా ఒక శాఖ తర్వాత మరొక శాఖ ప్రభుత్వజోక్యం అవసరంలేని వైపోతాయి. రాజ్యాంగయంత్రానికి వ్యక్తులమీద వుండే అధికారం పోయి, వుత్పత్తిపద్ధతిని సక్రమంగా నడపడం, పనులన్నీ సక్రమంగా, సరిగా జరిగేటట్లు అజమాయిషీ చేయడం మొదలైనవాటినే చేస్తుంటుంది. కడకు, 'రాజ్యాంగయంత్రం' యెవరిచేతనూ తొలగింపబడక తనంతటనే హరించి, 'అంతరించి' పోతుంది." ఏంజిల్స్ తన 'కుటుంబం, ప్రత్యేకాస్థి, రాజ్యాంగయంత్రం, వీటి మూలం' లో వ్రాసేడు.

"స్వతంత్రులూ, సమానులూనైన వుత్పత్తిదారుల సమూహాన్ని పునాదిగా చేసికొని, పునర్నిర్మాణ మొనరించే సమాజం 'రాజ్యాంగ యంత్రా'న్ని దానికి తగినచోటికే పంపుతుంది. అట్టి స్థాన మేది? పురాతన వస్తుప్రదర్శనశాలయే! అక్కడ పురాతనరాట్నం, సనాతనమైనకంచుగొడ్డలి మొదలైనవాటి ప్రక్కనే దీనికికూడా స్థానం లభిస్తుంది." ఏంజిల్స్ పై నుదహరించిన గ్రంథంలోనే.

తుదిమాటగా, దోచుకుంటూన్నవారిని దోచుకొనే కాలం వచ్చినప్పుడుకూడ చిన్నరైతులు నిరపాయంగానే వుండ

గలరు. వాళ్ళనిగురించి మార్క్సియన్ సోషలిజంయొక్క దృక్పథ మెట్లుంటుందా? యనే దాన్నిగూర్చి యేంజిల్సు తన వ్యాసంలో ప్రకటించేడు. 'ఫ్రాన్సు, జర్మనీలలోని రైతు సమస్య' అనే వ్యాసంలో యేంజిల్సు యిల్లా వ్రాసేడు;

"రాజ్యాంగాధికారాన్ని మనం హస్తగతం చేసికొన్నప్పుడు బీద రైతుల, చిన్నభూఖామందుల భూముల్ని వారినుంచి మనమెప్పుడును బలాత్కారంగా లాక్కోము. కాని పెద్దభూస్వాముల భూములనుమాత్రం లాక్కొనితీరుతాము. ఈ చిన్నరైతులలో సోదాహరణపూర్వకంగా ప్రచారంచేయడం మూలంగానూ, సామాజికసహాయ మొనర్చి క్రమక్రమంగా వారి వ్యక్తిగతభూస్వామ్యాన్నీ, వ్యక్తిగతవుత్పత్తినీ సహకారోత్పత్తిగానూ, సమిష్టిభూస్వామ్యంగానూ మార్పుచేస్తాము. అప్పుడే ఆ రైతులు మనం తీసికొనివచ్చిన మార్పులోని వుపయోగాల్ని తెలిసికొనేటట్లు చేయగలుగుతాము. ఆ వుపయోగాలు యిప్పటికే అతనికి తెలిసియుండవలసింది.

# శ్రామికవర్గపోరాటంలోని యెత్తులు

ఆచరణీయమైన విప్లవకార్యక్రమ ప్రాముఖ్యతను గుర్తించలేకా, గ్రహించలేకా ప్రాచీనభౌతికవాదం కొరవడియుండడాన్ని 1844-45 నాటికే మార్క్సు కనిపెట్టి, తన జీవితకాలమంతటిలోనూ సిద్ధాంతభాగంతోబాటుగా శ్రామికుల వర్గకలహామునందలి క్లిష్టసమస్యలను విడదీయడానికికూడ యావచ్ఛక్తినీ వినియోగిస్తూండేవాడు. మార్క్సు-యేంజిల్సుల మధ్య జరిగిన వుత్తరప్రత్యుత్తరా లన్నిటిలోనూ యీ విషయ

మైన అనేకసంగతులు దొరుకుతాయి. ఈ లేఖలు నాలుగు సంపుటాలుగా 1913లో ప్రకటించబడ్డాయి. కాని యీ విషయా లన్నిటినీ పరిశీలించి, విభజించి, వ్యాఖ్యానించడం యింకా పూర్తికాలేదు. అందుచేత మనం సర్వసాధారణ ములు, అవిశదములునైన సూత్రాలతోనే సంతృప్తిపడాల్సి వస్తూంది. ఈ వ్యవహారభాగంలేని భౌతికవాదసిద్ధాంతం కేవలం అసమగ్రం, పాక్షికం, నిర్వీర్యం అవుతుందని మార్క్సు చెప్పింది అక్షరాలా నిజమనిమాత్రమే మనం చెప్పగలుగు తున్నాము. గతితార్కికభౌతికసిద్ధాంతాల ననుసరించే శ్రామి కుల యెత్తుగడల్నీ, వాటి కర్తవ్యాన్నీ మార్క్సుమహాశయుడు నిర్ధరించియున్నాడు. ఒక నిర్దిష్టసమాజంలోని అన్ని వర్గాల యొక్క పరస్పరసంబంధాల మొత్తం ఫలితంయొక్క ప్రమా త్మకమైన నివేదికయే. ఆ సమాజం క్రమాభివృద్ధిని చెందేటప్పు డుండే ప్రమాత్మకపరిస్థితినీ, ఆ సమాజానికి యితరసమాజాలతో గల సంబంధాన్ని సవిమర్శకంగా చూస్తేనే, పురోగామివర్గం యొక్క సరైన యెత్తుగడల్ని నిర్ణయించ వీలుంటుంది. ప్రపంచంలోని ప్రతిదేశము, ప్రతివర్గమూకూడ గమనశీలములే గాని నిశ్చలములు గావు. (వాటి గమనసూత్రాలు ఆయా వర్గాల ఆర్థికస్థితినిబట్టి నిర్ణయింపబడుతూంటాయి.) మరియూ, నీ సమాజగమనం, గతకాలంయొక్క పరిస్థితులదృష్ట్యానే గాక భవిష్యత్కాలదృష్ట్యాకూడ చూడబడుతూంది. పరిణామ వాదుల అసంగతపాక్షికదృష్టికి కనిపించే చిన్నచిన్న మార్పులనే

గాక గతితార్కికదృష్ట్యా యీ సమాజపరిణామగతిని చూడవలసివుంటుంది. "అట్టి గొప్పయభివృద్ధులలో యిరవైసంవత్సరాలుకూడ ఒక్క రోజుతో సమానం. తర్వాత నా యిరవై సంవత్సరాల సారమూ కేంద్రీకరించబడిన ఒక్కరోజు వస్తుంది," అని మార్క్సు యేంజిల్సుకు వ్రాసేడు. శ్రామికు లీ యభివృద్ధి యొక్క ప్రతీఘట్టంలోనూ, ప్రతీక్షణమూ, మానవచరిత్రలో తప్పనిసరైన ప్రమాత్మకమైన గతితర్కాన్ని గమనిస్తూ, పరిస్థితుల ననుసరించి యెత్తులను నిర్ణయించుకుంటూండాలి. రాజకీయాలు నిలకడగా వున్నప్పుడు, అంటే ప్రశాంతంగా వుండి, మార్పు తాబేలునడకలో సాగుకాలంలో శ్రామికులు స్వవర్గచైతన్యమును, వర్గబలాన్ని, పోరాటశక్తినీ పెంపొందింపజేసుకోడానికి ప్రయత్నిస్తూండాలి. శ్రామికవర్గమే అత్యంతపురోగామివర్గం. అట్టి శ్రామికవర్గాన్ని గమ్యస్థానానికి చేర్చేందుకు 'యిరవైదినాల సారమైన' ఆ దినాలు వచ్చినప్పుడు చేయవలసిన కార్యకలాపాల్ని సాగిస్తూ, ఆ గొప్పదినాల్లో నిర్వహించాల్సిన ఘనకార్యాలకు వలసిన శక్తిసామర్థ్యోత్సాహాల్ని వాళ్ళల్లో పెంపొందింపచేస్తూండాలి. ఈ సందర్భంలో మార్క్సు యొక్క ముఖ్యవాదనలు రెండింటిని చెప్పాల్సివుంటుంది. మొదటిది, 'తత్వశాస్త్రదారిద్ర్యం' అనే గ్రంథంలో, పారిశ్రామికపోరాటానికీ, పారిశ్రామికకార్మికసంస్థల నిర్మాణానికీ చెందినది వ్రాసేడు. రెండోది, శ్రామికుల రాజకీయకర్తవ్యాన్ని చెప్పేది,

కమ్యూనిస్టు మానిఫెస్టోలో వుంది. ఈ రెంటిలోనూ, మొదట చెప్పిన దానిలో యిల్లా వుంది:

"భారీపరిశ్రమలు అపరిచితులైన వ్యక్తుల నెందర్నో ఒక్కచోటికి చేరుస్తాయి. పోటీ యనేది వాళ్ళలో భేదాల్ని కలుగజేస్తుంది. కాని తమ కూలిని తగ్గకుండ చూసుకోవాలనే వర్గప్రయోజనమే, వాళ్ళ యజమానికి వ్యతిరేకంగా వారందరినీ కలిపి, యేకంగా నుండడానికి ప్రేరేపిస్తుంది. ... వారిలోని యీ కలయిక మొట్టమొదట దృఢంగా వుండదు. ... కాని క్రమంగా పెద్ద సంఘము లేర్పడి బలీయము లవుతూంటాయి. తమ కూలి తగ్గకుండా చూచుకోడంకంటె, సంఘముల నిట్లు బలీయ మొనర్చుకోవడమే శ్రామికుల కెక్కువ ఆవశ్యక మవుతుంది. ఎందువల్లనంటే, పెట్టుబడి కేంద్రీకరించబడుతూ క్రమంగా అమితశక్తిని సమకూర్చుకుంటూంటుంది. దాని నెదుర్కోడానికి కార్మికవర్గానికికూడా సంఘశక్తి అవసరం. ... ఈ వర్గ పోరాటంలో, అంటే ఒకవిధమైన అంతఃకలహంలో భవిష్యన్మహాసంగ్రామానికి అవసరమైన శక్తులన్నీ ఐక్యములవుతూ అభివృద్ధి జెందుతూంటాయి. ఈ పరిస్థితిలోనికి వస్తే చాలు నింక, యీ సంఘములు రాజకీయ స్వభావం గలవైతీరుతాయి." (తత్వశాస్త్రదారిద్ర్యం.)

ఇందులో కార్మికుల ఆర్థికపోరాటానికీ, కార్మికసంఘోద్యమానికీ కార్యక్రమమూ, యెత్తుగడలూ యివ్వబడినాయి. రానున్న అనేకసంవత్సరాలవరకూ, కార్మికులు 'రాబోవు పోరాటానికి' తయారవుతూన్న మధ్యంతరకాల మంతటికీ యీ కార్యక్రమం, యెత్తులు వర్తిస్తాయి. మార్క్సు యేంజిల్సుల లేఖల్లోంచి యీ విషయమైన యనేకవుపయుక్తాంశాల్ని యేరి తీయవచ్చును. ఈ సందర్భంలోనే బ్రిటిష్ లేబర్ మూవ్‌మెంట్ విషయమై చాల చక్కగాను, యదార్థంగానూ మార్క్సు

విశదీకరించేడు: పరిశ్రమ లభివృద్ధిదశలో వుండడంచేత పని వాళ్ళని 'కొనివేయడానికి' యెల్లా ప్రయత్నించుతున్నారో, వారిని పోరాటపంథానుంచి తప్పించడానికి యెల్లా కృషిచేస్తున్నారో; సుదీర్ఘకాలంవరకూ లాభప్రదంగావున్న పారిశ్రామిక పరిస్థితుల్లో కార్మికుల్లో నిరుత్సాహమూ, అధైర్యమూ యే విధంగా ప్రబలమవుతాయో; బ్రిటిష్ శ్రామికవర్గం యే రీతిగా 'బూర్జువా వైఖరి' గల దవుతూందో; అన్ని జాతుల్లోకీ గాఢమైన బూర్జువాస్వభావం గల బ్రిటిష్‌జాతి, బూర్జువా వర్గంతోబాటు బూర్జువాప్రభువుల్నీ బూర్జువాశ్రామికుల్నీ సృష్టించడాని కెల్లా యత్నిస్తూందో; బ్రిటిష్ శ్రామికవర్గంలోని విప్లవశక్తి యే విధంగా హరించిపోతూందో; బ్రిటిష్ శ్రామిక వర్గాన్ని సంకరంచేస్తూన్న బూర్జువాప్రభావాన్నుంచి దాన్ని విముక్తి గావించేందుకు మన మెంతకాలం వేచివుండాలో; వెనుకటి ఛార్టిస్టులలోని శక్త్యుత్సాహాలు వర్తమాన బ్రిటిష్ కార్మికోద్యమంలో యే విధంగా లోపించివున్నాయో; బ్రిటిష్ కార్మికుల్లోని నాయకులు 'అతివాదబూర్జువాలకూ, కూలీలకూ మధ్యంతరంలో వుండే నాయకులు'గా యెల్లా తయారవుతూన్నారో, (హోలియోక్ ను గురించి); బ్రిటిష్ (మోనాపలీ) గుత్తాధికారం వున్నంతకాలం, దాని కారణంగా బ్రిటిష్ కార్మికులు తెగింపు చేయజాలరనీ, సకారణంగా మార్క్సు స్పష్టీకరించేడు. కార్మికోద్యమం సాధారణకార్యక్రమంలో ఆర్థిక పోరాటంయొక్క యెత్తులు, సర్వతోముఖమూ, గతితాత్త్విక

బద్ధమూ, విప్లవయుతమూ, సమగ్రవిశాలమూనైన దృష్టితో నిర్ణయించబడినాయో చూసినవాళ్ళకి తెలుస్తుంది.

రాజకీయపోరాటాల యెత్తుగడలవిషయమై మార్క్సు యను మూలసిద్ధాంతము కమ్యూనిస్టు మానిఫెస్టోలో యిల్లా చెపుతూంది: "శ్రామికవర్గంయొక్క తాత్కాలికకోర్కెల పక్షాన వుండి, వాటికోరకై కమ్యూనిస్టులు పోరాటం కొనసాగిస్తారు. అట్లు చేయడంలోనే వారు వుద్యమభవిష్యత్తును సంరక్షిస్తూన్నారుకూడను.'' 1846లో క్రాకో తిరుగుబాటును లేవదీసిన, రైతు విప్లవపార్టీయైన పోలిష్ పార్టీని మార్క్సు 1848లో బలపరచడానికి కారణమిదే. 1848, 1849ల్లో జర్మనీలోని విప్లవప్రజాతంత్రతీవ్రవాదుల్ని బలపరచడమేగాక, అటు తర్వాతకూడా తానప్పుడు యెత్తుగడల్ని గురించి చెప్పినదానిని వుపసంహరించుకోలేదు. మొదటినుంచీ జర్మన్ బూర్జువావర్గం ప్రజలకు ద్రోహం చేస్తూనేవుందనీ, దాని నైజమే అది యనీ మార్క్సు చెపుతూండేవాడు. (రైతులతో ఒక్కతూరి సంబంధం కల్పించుకొంటే చాలు వారి పతకం పారిందన్నమాటే!) పాత సమాజావశేషులైన కిరీటధారులతో రాజీ గావించుకోడ కూడా వారికి స్వాభావికమే. బూర్జువాప్రజాతంత్రవిప్లవయుగంలో జర్మన్ బూర్జువాయొక్క పరిస్థితిని మార్క్సు సంగ్రహంగా చెపుతూ, సమాజాన్ని గమనశీలమైన దాన్నిగానే, అందులోనూ తిరోగమనంమీదే దృష్టివుంచుకోకండా వుంటూ, భావించాలని నిర్ధరించేడు. ఆయన చెప్పిన యీ విషయం భౌతికవాదాని కుదాహరణగా వుంది. జర్మన్ బూర్జువాలను,-

"తమ శక్తిలోనూ విశ్వాసంలేదు. పోనీ, ప్రజల్ని నమ్ముతారా అంటే నమ్మనూ లేరు; తమ పైవారి యెడ సణుగుతు, గొణుగుతూంటారు; తమ క్రిందివాళ్ళని చూస్తే బెదరు, వణకు. ... విశ్వవ్యాప్తమైన కల్లోలం వస్తుందేమో యనే పిరికితనం. ... యే విషయంలోనూ స్వతంత్రశక్తి లేదు; ప్రతీదానిలోనూ అభిప్రాయచౌర్యమే ... కార్యనిర్వహణశక్తి, వుత్సాహమూ సున్న ... వృద్ధి ముసలితొక్కు కొలపలితమైన తన ప్రయోజనాల్నీ వుద్దేశాల్నీబట్టి నవయౌవనోత్సాహపూరితులైన ప్రజల్ని వారి ప్రథమయౌవనానుభవములకు నడిపించ జూచునట్లుంది, వారి గతి. ..." న్యూ రైనిష్ జీటంగ్ - 1848. లిటరారిశ్చర్ నాచ్‌లాస్ - 3 వాల్యూం.

దీనికి యిరవై యేళ్ళ తర్వాత 1865 ఫిబ్రవరి 11వ తేదీని యేంజిల్స్‌కు వ్రాసిన లేఖలో మార్క్సు యిల్లా వ్రాసేడు: "1848 లో విప్లవం ఓడిపోడానికి కారణం ఒక్కటే: బానిసత్వంలో వున్నాసరే మాకు శాంతియే గావాలి కాని స్వాతంత్ర్యం వస్తుందన్నా యుద్ధంచేయడం మాకిష్టం లేదని అప్పుడు బూర్జువావర్గం త్రోసేసింది. అదే ఓటమికి కారణం." 1848–49 నాటి విప్లవయుగం తర్వాత 'విప్లవం! విప్లవం!' అని చీటికీమాటికీ లాఘవంగా అనడాన్ని మార్క్సు ఖండించేవాడు. (షాప్పర్, విల్లిచ్‌లు, వాళ్ళతో తగాదా.) ఎందుకంటే, నూతనవిప్లవానికి బీజావాపనమై, అవి మెల్లగా మొలక లెత్తుతూండే యీ 'శాంతి' (పేరుకే!) సమయంలో పరిస్థితు లేమిటో, మన మెల్లా నడచుకోవాలో యనేవేమీ గమనించక తొందరపడితే లాభంలేదని మార్క్సు అభిప్రాయం. జర్మనీలో పరిస్థితులు చాల నికృష్టస్థితిలో వున్నప్పుడు మార్క్సు వేసిన

అంచనాలనుబట్టి, కార్యనిర్వహణవిషయంలో ఆయన భావాల్ని మనం తెలుసుకోగలము. 1856 లో ఆయన యిల్లా వ్రాసేడు: "ఏదో రకంగా మరొక రైతుపోరాటాన్ని దెచ్చి, తన్మూలంగా శ్రామికవిప్లవాన్ని ప్రోత్సహించడం సాధ్యమా? యనే విషయంమీదనే. నేడు జర్మనీలోని పరిస్థితులన్నీ ఆధారపడి యున్నాయి." బ్రీఫ్ వెషెల్, రెండో వాల్యూం.

జర్మనీలో బూర్జువాప్రజాతంత్రవిప్లవం అభివృద్ధిజెందుతూండే కాలంలో సోషలిస్టుశ్రామికుల యెత్తుగడల విషయమటుంచి, రైతుల్లో ప్రజాతంత్రభావాల నభివృద్ధిజేయడానికి మార్క్సు తన యావచ్ఛక్తినీ వినియోగపరుస్తూండేవాడు. "పరిశీలించి చూస్తే లాసెల్లి పనులకు ఫలితం శ్రామికోద్యమానికి ద్రోహమే ననేది యదార్థం. ఎందుచేతంటే, అతడు జర్మన్ నిరంకుశప్రభువర్గానికీ, ప్రష్యన్ జాతీయతకూ సాయపడుతూవున్నాడు," అని మార్క్సు వాదిస్తూండేవాడు. 1865 ఫిబ్రవరి 5వ తేదీని, తామిద్దరూ సంప్రదించుకొనే గావించిన ప్రకటనలో యేంజిల్సు యిల్లా వ్రాసేడు.-

"వ్యావసాయికదేశాల్లో కేవలం పారిశ్రామికకూలీల తరఫునే వుద్యమాన్ని నడిపి, బూర్జువావర్గము నెదుర్కొనడం చాల తెలివితక్కువపని. రైతువర్గాన్నికూడా మన వుద్యమంలోనికి లాక్కొనిరావాలి. పెద్దపెద్ద జమీందారీప్రభువులు కొరడాలతో కొట్టి, దోపిడీ చేసే పద్ధతులు రైతుల్లో ప్రచారం చేసి, వాళ్ళని తగు ఆత్మవిశ్వాసం గలవాళ్ళనిగా తయారుచెయ్యాలి.'' బ్రీఫ్ వెషెల్- మూడో వాల్యూం.

1864-1870 మధ్యకాలంలో జర్మన్ బూర్జువా ప్రజాతంత్రవిప్లవం ముగింపు కావస్తూంది. ప్రష్యా, ఆస్ట్రియాలలోని బూర్జువావర్గము యేదో ఒకలాగున విప్లవాన్ని పైనుంచి పూర్తిచేయచూస్తూవున్న సమయమది. బిస్మార్కుతో కపటకుట్రలు చేసినందుకు లాసెల్లీని ఖండించడమే గాక, విల్ హెల్మ్ లీబ్ నెచ్ దారితప్పి చివరికి ఆస్ట్రోఫిలిజమ్ (సంకుచితమైన ఆస్ట్రియను జాతీయత) లోకి దిగినప్పుడాతన్ని సరైన మార్గానికి తెచ్చి, కార్మికవర్గపార్టీ ప్రత్యేకతను కాపాడేడు. బిస్మార్కుతోనూ, ఆస్ట్రోఫిలిజమ్‌తోనూకూడ సమానకాఠిన్యంతో నేపోరాడేయెత్తుల్ని అవలంబించి, తీవ్రవిప్లవాదాన్ని సాగించేవాడు, మార్కుసు. విజయులైన ప్రష్యన్ ప్రభువర్గంతోనే, వాళ్ళు జయించడం మూలంగానే యేర్పడిన పునాదులపైననే వాళ్లతో పోరాటాన్ని తిరిగి కొనసాగించేందుకు తగినట్టి విప్లవాత్మకమైన యెత్తుల్ని, విజయవంతులైన ప్రష్యన్ ప్రభువర్గానికే గాక వాళ్ళ మీాది పోరాటానికికూడ పనికివచ్చే యెత్తుల్ని మార్కుసు నిర్ధరించేడు. అంతర్జాతీయకార్మికసంఘం (మొదటి యింటర్నేషనల్) తరఫున 1870 సెప్టెంబరులో యిచ్చిన ప్రఖ్యాతోపన్యాసంలో మార్కుసు, విప్లవం లేవదీయడానికి తరుణ మింకా ఆసన్నం కాలేదని ఫ్రెంచిశ్రామికవర్గాన్ని హెచ్చరించేడు. కాని, 1871లో విప్లవం బైలుదేరినప్పుడు మార్కుసు వాళ్ళని నిరుత్సాహపరచక (మింటిని ముట్టడిస్తున్నారు కార్మికులంటూ) వారి ననేకరీతులుగా ప్రోత్సహించేడు. (కూగల్ మన్‌కు లేఖ.) ఈ విప్లవం ఓడిపోయింది. కాని, ఆ పరిస్థితుల్లో శత్రువు

నొక్క దెబ్బయైనా కొట్టకండా లొంగిపోవడంవల్ల శ్రామికుల్లో కలుగు నిరుత్సాహం, వారిని విప్లవసంసిద్ధుల్ని జేయుటకుమారు వాళ్ళలో పతనాన్నే కలిగిస్తుంది. ఈ విప్లవంలో ఓడిపోవడంవల్ల గలిగిన నష్టం వెనుదీయడంవల్ల కలుగు నష్టంకంటె చాలతక్కువే నని గతితార్కికభౌతికవాదరీత్యా మార్క్సు నిరూపించేడు. శ్రామికవర్గకలహం యొక్క సాధారణగమనాన్ని చూసినా, తత్ఫలితాల్ని బట్టి చూసినా యిది నిజమని ఋజువౌతూంది. రాజకీయాలు కదలిక లేకండా, బూర్జువాచట్టబద్ధత అమలులో వుండే పరిస్థితుల్లో, చట్టబద్ధవిధానంలో పోరాటాన్ని సాగించాల్సిన అవసరం యెంతో వుంది. దీన్ని మార్క్సు గుర్తించే తన బోధనల్లో పొందుపరిచేడు. 1877-78 ల్లో జర్మనీలో సోషలిస్టుల నణచడానికై ప్రభుత్వం 'మినహాయింపుల చట్టం' (ఎక్సెప్షన్ లా) ప్రయోగించి నప్పుడు, 'విప్లవకరమైన మాటలు' చెప్పడాన్ని మార్క్సు తీవ్రంగా ఖండించేడు. కాని, ముద్రాధికారాలున్న (అఫీషియల్) సోషల్ - డెమాక్రాటిక్ పక్షంలో ప్రబలివున్న అవకాశవాదతత్త్వాన్ని అంతకంటే తీవ్రంగా ఖండించేవాడు. అవకాశవాదవిధానాలు కార్మికుల్లోనూ, సభ్యుల్లోనూ పోరాటశక్తినీ, దార్ఢ్యంగా నిలదొక్కుకుని నిలబడే శక్తినీ నశింపజేయడమే గాక 'మినహాయింపుల చట్టం' కు ఎదురొత్తుగా రహస్యపద్ధతుల్లో విప్లవాన్ని నడుపుదామనే ధీమాను, విప్లవశక్తిని నశింపుజేస్తాయి. అందువల్ల యిట్టి ధోరణుల్ని కూడ మార్క్సు తీవ్రంగా ఖండించేవాడు. (బ్రీఫ్ వెషెల్, నాలుగో సంపుటం; సోర్జికి వ్రాసిన లేఖ చూడండి.)

సంపూర్ణము.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

I

# పర్యాయపద సూచిక

అంతర్యుద్ధం—Civil War
అధికారము, శక్తి—Authority, Power
అదనపు విలువ—Surplus value
అనిశ్చయవాదం—Agnosticism
అనుపాతం—Proportion
అభివృద్ధి నిరోధక—Reactionary
అస్తిత్వం—Existence
అస్థిర పెట్టుబడి—Variable capital
అవకాశవాదం—Oppertunism
ఆజ్ఞాశక్తి, ప్రభుశక్తి—Authority
ఆదర్శవాదం—Idealism
ఆదిమ, ఆదిమకాలపు—Primitive
ఆధేయము, సాపేక్షము—Relative
ఆధ్యాత్మికం—Spiritual
ఆర్థిక సంఘటనలు—Economic phenomenon
ఆర్థిక పెట్టుబడి—Finance capital
ఆర్థిక పునాది—Economic foundation
ఆస్తిక వాదం—Theology
ఆస్తి సంబంధాలు—Property relations
అవశ్యకత—Necessity
ఉత్పత్తి—Production
ఉత్పత్తి పరికరాలు, సాధనాలు—Means of production
ఉత్పాద్యశక్తి—Productivity
ఉత్పత్తి సంబంధాలు—Production relations
ఉత్పత్తి శక్తులు—Productive forces

ఉత్పత్తిశాఖ—Branch of production
ఉత్పాదక శ్రమ—Productive labour
ఉద్యోగవర్గం—Officialdom
ఉపయోగపు విలువ—Use value
ఉపయోగార్హత—Utility
ఎత్తులు, ఎత్తుగడలు—Tactics
ఏకాధిపత్యం—Monarchy
కూలి—Wage
కూలి-పని—Wage-labour
కులీన పాలనం—Aristocracy
కార్మికవర్గం, శ్రామికవర్గం—Working class
ఖరీదు—Price
గమనం, చలనం, గతి—Motion
గతి తర్కం—Dialectics
గమనశీలము, చలనశీలము—Dynamic
ఘటన—Event
చరిత్ర రచనాశాస్త్రం—Historiography
చలనశక్తి—Mobility
చారిత్రక చర్య—Historical activity
చారిత్రక క్రమపద్ధతి—Historical process
చారిత్రక భౌతికవాదం—Historical Materialism
చోదక శక్తి—Motive Force
జమీందారీ విధానం—Feudalism
జమీందారీ సమాజం—Feudal Society
జాతీయత—Nationalism
జాతి వైరుధ్యాలు—National antagonisms
జిజ్ఞాసావాదం—Gnoseology
జీవశాస్త్రం—Biology

తత్త్వశాస్త్రం—Philosophy
తాత్త్విక భౌతికవాదం—Philosophic Materialism
తిరుగుబాటు—Insurrection
తుల్యత—Equivalent
దశ, ఘట్టం, మజిలీ—Stage
దాసుడు—Serf; దాసత్వవిధానం—Serfdom
దృశ్యవిషయం, దృశ్యలక్షణం—Phenomenon
ధనపు పెట్టుబడి—Money capital
ధర్మశాస్త్రం—Jurisprudence
నికర శిస్తు—Absolute rent
నియమాలు, శాసనాలు, చట్టాలు—Laws
నిరపేక్షము—Absolute
నిర్దిష్టము—Concrete, given
నిశ్చలములు—Static
నిశ్చయవాదం—Positivism
నిష్పత్తి—Ratio
పదార్థం—Matter
పని, శ్రమ—Labour, work
పరతత్త్వ—Metaphysical
పరిణామం—Evolution
పరిసరాలు—Environment
పీడన—Oppression
పునరుత్పత్తి—Re-production
పెట్టుబడి—Capital
పైతృక, పితృస్వామ్య—Patriarchal
పోటీవిధానం—Competition
ప్రయోజనం—Interest
ప్రజాతంత్రం, ప్రజాస్వామ్యం—Democracy, Republic

ప్రతిబింబాలు—Reflections
ప్రతినిధి సంస్థలు—Representative Institutions
ప్రత్యేకపుటాస్తి—Private property
ప్రమాత్మక—Objective
ప్రమాణము—Standard
ప్రభుత్వం—Government
ప్రభువు—Baron, Lord, King
ప్రకృతి—Nature; ప్రకృతిశాస్త్రం—Natural Science
ప్రోగుపడడం, సంచితంకావడం—Accumulation
బహుళోత్పత్తి విధానం—Large-scale production
బానిస—Slave
భావము-Idea; భావవాదం-Idealism
భూమిశిస్తు—Ground rent
భౌగోళికము—Geographical
భౌతికవాదం—Materialism
మనకొరకైన పదార్థం—Thing-for-us
మధ్య తరగతి—Middle class
మారకపు విలువ—Exchange value
ముద్రాధికారాలున్న—Official
యాంత్రికము—Machanical
రాజ్యాంగయంత్రం—State
రహదారులు, రహదారీ సాధనాలు—Communications
లాభం—Profit
వర్గం, వర్గకలహం, వర్గస్పర్థలు—Class; C. Stuggle; C antagonisms
వర్తకపుసరకు; సరకు—Commodity
వడ్డీ-Interest; వడ్డీ పెట్టుబడి-Usurer's capital
వర్తకపు పెట్టుబడి—Commercial capital

విజ్ఞాన సర్వస్వం—Encyclopedia
విశ్వభావన—World conception
విమర్శావాదం—Criticism
విజ్ఞానవాదం—Epistimology
విలువ—Value
వివరణ—Analysis
వైరుధ్యాలు—Contradictions
వృత్తికుశలురు, నిపుణులు—Artisans, Craftsmen
వ్యక్తివాదం, భ్రమాత్మకవాదం—Subjectivism
వ్యక్తిస్వామ్యం—Individual ownership
శక్తి—Spirit
శాసనబద్ధ—Constitutional
శిస్తు—Rent; శిస్తుతేడా—Differential rent
శ్రమకాలం-Labour time; శ్రమశక్తి-Labour power
శ్రమ విభాగం—Division of labour
శ్రేణి-Guild
శ్రేణి-కూలీ—Journey-man
శ్రేణి-యజమాని—Guild-burger
సంఘటనలు—Events
సర్వపదార్థ సారం—Essence-of-things
సగటులాభం రేటు—Average rate of profit
సమిష్టి భూస్వామ్యం— Co-operative land-owership
సామాజిక విప్లవం—Social Revolution
సామంతుడు—Patrician
సామాన్యుడు—Plebian
సామాజిక పెట్టుబడి—Social capital
సామాజిక మొనర్పు—Socialisation
సిద్ధాంతం—Theory, Doctrine

స్థిర పెట్టుబడి—Constant capital

స్వయం పదార్థం—Thing-in-itself

స్వతంత్రుడు—Free-man

స్వత్వపద్ధతి, గుత్తాధికారం—Monopoly

స్వేచ్ఛ—Freedom

స్మృతి విజ్ఞాన సిద్ధాతం—Theory of cognition

స్పర్థ—Conflict

స్వేచ్ఛాసంకల్పం—Free-will.





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| పుస్తకం సంఖ్య | TPLA1061B198 |
| పుస్తకం పేరు | కారల్ మార్క్స్ ఉపన్యాసాలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | no |
| పరిస్థితి | Good. |